LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 45 | 10.11.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# ఉల్ఫెన్‌సన్ వెంట సర్కార్ ఆల్సేషియన్

ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు ఉల్ఫెన్‌సన్ రాష్ట్ర పర్యటన వివాదస్పద మైపోయింది. తమ అప్పులతో అమలు జరుగుతున్న కార్యక్రమాలను పరిశీలించడానికి ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలలో పర్యటిస్తున్నారాయన. అప్పు ఇచ్చే బ్యాంక్ అధికారులకు ఇటువంటి పర్యటనలు చేసే అధికారం వుంటుంది. వారు ఎప్పుడైనా రావచ్చు. ఏ పనినైనా పరిశీలించవచ్చు. దాన్ని తప్పు పట్టడానికి లేదు, అభ్యంతర పెట్టడానికి లేదు. ఇక్కడ సమస్య ప్రపంచ బ్యాంక్ అధ్యక్షుడి పర్యటన కాదు; ఆ పర్యటన కోసం రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ఏర్పాట్లు, చూపుతున్న అతి ఉత్సాహం మాత్రమే వివాదాస్పద అంశాలు.

ఉల్ఫెన్‌సన్ గురువారం మధ్యాహ్నం హైదరాబాద్‌కు వచ్చారు. ముఖ్యమంత్రి స్వయంగా ఆయనను సకల రాచమర్యాదలతో స్వాగతించారు. ఉల్ఫెన్‌సన్ శుక్రవారం సాయంత్రం తిరిగి వెళ్తారు. ఆయన బస గ్రాండ్ కాకతీయ హోటల్‌లో! హైదరాబాద్‌లో వుండే రెండు రోజులలో ఆయన ముఖ్యమంత్రితో సమావేశం వంటి సాధారణ కార్యక్రమాలతో పాటు, రంగారెడ్డి జిల్లాలో కొన్ని గ్రామాలు సందర్శించబోతున్నారు. నీళ్ల సంఘాలు, వనసంరక్షణ సమితి సభ్యులతో వ్యక్తిగతంగా మాట్లాడుతారు. ఒక బహిరంగ సభలో ఉపన్యాసం చేస్తారు. ఈ కార్యక్రమాలకు ప్రభుత్వం విస్తృత ఏర్పాట్లు చేస్తున్నది. ఇతరదేశాల

## అప్పు ఇచ్చినవాడి ముందు ఆంధ్రుల ఆత్మగౌరవం

ప్రధాన మంత్రులు పర్యటనలకు వచ్చినప్పుడు చేసే గౌరవ మర్యాదలు అందిస్తున్నది. ఉల్ఫెన్‌సన్‌ను స్వయంగా స్వాగతించటానికి ముఖ్యమంత్రి ఎయిర్ పోర్టుకు వెళ్తున్నాడు. ఈ రెడ్‌కార్పెట్ స్వాగతం ప్రోటోకాల్‌కు విరుద్ధమని రాష్ట్ర ప్రభుత్వ అధికారులు ససపెడుతుంటే, ఏకంగా ఉల్ఫెన్‌సన్ హాజరయ్యే ప్రతి కార్యక్రమంలో పాల్గొనడానికి సిద్ధమౌతున్నాడు చంద్రబాబు. సాధారణంగా ఇటువంటి విదేశీ ప్రతినిధుల వెంట ప్రభుత్వ అధికారులు మాత్రమే వుంటారు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో రాష్ట్ర మంత్రులు ప్రోటోకాల్ ఆఫీసర్లుగా వ్యవహరిస్తుంటారు. కాని సాక్షాత్తు ముఖ్యమంత్రి ఉల్ఫెన్‌సన్ వెంట దఫేదార్ వలె తిరగడం, చేతులు కట్టుకుని నిలబడడం ఇప్పటి వివాదాలకు తెర తీస్తున్నది. ముఖ్యమంత్రి అంటే ప్రజలకు ప్రతినిధి. ముఖ్యమంత్రి విదేశీయుల ముందు అవసరానికి మించి తల వంచితే అది ప్రజల ఆత్మగౌరవాన్ని దెబ్బ తీసినట్లు అవుతుంది.

నిజానికి ఉల్ఫెన్‌సన్ రాష్ట్ర ప్రజలకు లేదా ప్రభుత్వానికి చేస్తున్న లేదా చేయగల్గిన మేలు అంటు ఏదీ లేదు. ఆయన చేసే ఒకే ఒక్క పని అప్పు ఇవ్వడం. అదికూడా ఎన్నో నిబంధనలు, ఆంక్షలు, పరిమితులకు లోబడి వుంటుంది. వడ్డీ లేకుండా అప్పు ఇచ్చే అధికారం ఉల్ఫెన్‌సన్‌కు లేదు. వడ్డీ తగ్గించే అవకాశం కూడా లేదు. రాష్ట్ర ప్రభుత్వం అప్పు తిరిగి కట్టలేని పరిస్థితి

కొరవ 7వ పేజీలో

# ఢిల్లీ వీధుల్లో తెలుగు రాక్షసత్వం

కేంద్రమంత్రి వెంకయ్య నాయుడు మొన్న ఉదయగిరి వచ్చినప్పుడు బహిరంగ సభలో మాట్లాడుతూ, ఒంగోలు ఎమ్మెల్యే కరణం బలరామ్‌కు ఒక సూచన చేశారు. గతంలో మీరు ఎట్లా ప్రవర్తించినా, ఇప్పుడు పార్లమెంట్ సభ్యుడుగా వున్నారు కాబట్టి నేరపూరిత ప్రవర్తనను, ప్రవృత్తిని మానుకోమని సలహా ఇచ్చాడు వెంకయ్య నాయుడు. ఆయన ఈ మాటలు పలికింది అక్టోబర్ 31తేది; అయితే ఈ మాటలు ఇంకా గాలిలో కల్సి పోక మునుపే కరణం బలరాం, నవంబర్ రెండవతేది, అంటే కేవలం రెండు రోజుల వ్యవధిలో ఒక అమాయక యువకుడి ప్రాణాలకు ప్రమాదం తెచ్చి పెట్టారు.

## కరణం కోసం పోలీసు వేట

నవంబర్ రెండవతేది న్యూ ఢిల్లీ షాజహాన్ రోడ్లో కరణం బలరాం గారి ఫియట్ 118 కారు ( దాని నంబరు ఎపి9క 7542) ఒక యువకుడిని గుద్దేసింది. షాజహాన్ రోడ్ అంటే వెంకయ్య నాయుడు ఇల్లు వుండే వీధి కావడం గమనార్హం. తాజ్ మాన్‌సింగ్ హోటల్ సమీపంలోని ఒక పెట్రోల్ బంకు వద్ద రోడ్ ప్రక్కగా మోటార్ సైకిల్‌పై కూర్చుని వుండినాడట ఈ యువకుడు. అతడి పేరు - సోహన్ పాల్. విప్రో కంప్యూటర్ సంస్థలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడట. కరణం బలరాం కారు వేగంగా వచ్చి ఆ మోటార్ సైకిల్ వెనకనుంచి గుద్దింది. ఆ అదుటుకు ఆ యువకుడు 20 గజాల దూరం ఎగిరి పడిపోయాడు. కార్లో వున్న వారు కొంత దూరం ముందుకు వెళ్లి, ఆ తర్వాత ఎందువల్లో వెనక్కు తిరిగివచ్చి, రోడ్డుపైన రక్తపు మడుగులో పడివుండిన ఆ యువకుడ్ని చేతులతో ఎత్తుకుని తమ కారులోనే కూర్చొబెట్టి తీసుక వెళ్లారట. రోడ్డుపై నిలబడి ఈ ఘోర ప్రమాద దృశ్యం చూస్తుండిన వారు, కార్లోని వ్యక్తులు ఆ యువకుడ్ని ఆస్పత్రిలో చేర్చడానికి తీసుక వెళ్తున్నారనుకుని, వారికి సహాయపడ్డారు. అయితే వారు కొంత దూరం ప్రయాణించి, ఆల్ ఇండియా మెడికల్ సైన్సెస్ సంస్థ సమీపంలో

కొరవ 7వ పేజీలో

# పదవుల పంపకంలో బాబు 'బిర్రు' - ఎమ్మెల్యేల గుర్రు

స్వర్గీయ మాధవరెడ్డి సతీమణి ఉమా మాధవరెడ్డిని రాష్ట్ర మంత్రివర్గంలోకి తీసుకున్నాడు ముఖ్యమంత్రి. వున్నట్లుండి జరిగిపోయింది ఈ కార్యక్రమం. మంత్రి వర్గ విస్తరణ జరుగుతున్నట్లు ఎమ్మెల్యేలకు ఎంత మాత్రం పొడిడి అంద లేదు. ఎమ్మెల్యేలు, పార్టీ నాయకులు జిల్లాలకు తరలి వెళ్లి తక్షణం పార్టీ సభ్యత్వాల కార్యక్రమం ప్రారంభించాలని ఆదేశం చేసి, అందరు రైళ్లు ఎక్కిన తర్వాత హఠాత్తుగా మంత్రివర్గ విస్తరణ జరిపించేశాడు ముఖ్యమంత్రి. తెలుగుదేశం పార్టీలో మాధవరెడ్డి ప్రాధాన్యత అందరికీ తెల్సిందే. పార్టీ మనుగడకు చంద్రబాబు కంటే ఎక్కువ కష్టపడిన వాడు మాధవరెడ్డి. ఆయన అంతటి విషాద పరిస్థితులలో చనిపోవడం సహజంగా దురదృష్టకరం. ఆయన మరణం వ్యక్తిగత కక్షలు లేదా రాజకీయాల వల్ల జరిగింది కాదు. ప్రభుత్వపరంగా నిర్వర్తించిన బాధ్యతలకు తన ప్రాణం బలిపెట్టుకున్నాడు మాధవరెడ్డి. ఆయన పార్టీకి, ప్రభుత్వానికి చేసిన సేవలతో పోలిస్తే ఆయన సతీమణికి మంత్రి పదవి ఇవ్వడం పెద్ద గొప్ప విశేషం కాదు. ఆమెను ఎమ్మెల్యే ఎన్నికలలో నిలబెట్టినప్పుడే మంత్రిత్వం ఖాయం అన్న సంగతి అందరూ వూహించారు. అందువల్ల అది ఆశ్చర్యపడదగిన వార్త కాదు.

ఆశ్చర్యమల్లా కేవలం ఆమె ఒక్కరి కోసం విస్తరణ జరపడం. రాష్ట్ర మంత్రివర్గంలోకి కొత్త వారిని తీసుకుంటున్నారన్న ఆశ తెలుగుదేశం ఎమ్మెల్యేలలో

## అసహాయ అసమ్మతీయులు - అదను కోసం ఎదురుచూపులు!

చాలా కాలం నుంచి వుంది. ముఖ్యమంత్రి కూడా అప్పుడప్పుడు ఆ సూచన చేస్తుండినాడు. ఇప్పటి మంత్రులలో అసమర్థులను తొలగించి కొత్త వారికి అవకాశం ఇస్తానని చెప్తుండేవాడాయన. పార్టీ శాసనసభ్యులలో ఈ మధ్య అసమ్మతి, అసంతృప్తి పెరిగిపోతున్నాయి. గత ప్రభుత్వ కాలంలో ఎమ్మెల్యేలకు మంత్రిత్వాలు రాకపోయినా, జన్మభూమి వంటి కార్యక్రమాల ద్వారా వారికి చేతినిండా పని, జేబు నిండా డబ్బు దొరుకుతుండినాయి. కాని ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ఒక్క అభివృద్ధి కార్యక్రమమూ చేపట్టే పరిస్థితిలో లేదు. అందువల్ల ఎమ్మెల్యేలు నియోజక వర్గాలకు వెళ్లి ప్రజలకు ముఖం చూపించలేక పోతున్నారు. ఇంకొక ప్రక్క టీచర్లతో సహా ప్రభుత్వ ఉద్యోగుల బదలీలు, రాజకీయ వాదుల పలుకుబడి పరిధి నుంచి తప్పించి వేశారు. కౌన్సిలింగ్ విధానం ప్రవేశపెట్టడం వల్ల ఎమ్మెల్యేలను పట్టించుకునే వారే లేకుండా పోయారు. బదలీలు, నియామకాలు నేరుగా జరిగి పోతున్నాయి.

ప్రభుత్వ కార్పొరేషన్లు, సంస్థల ఛేర్మన్ పదవులను సైతం అందని ద్రాక్షపళ్ల వలె వుంచుతున్నాడు చంద్రబాబు. ఎన్ని నెలలు, సంవత్సరాలు గడిచినా వాటికి నియామకాలు జరపడం లేదాయన.

ఇక ఇప్పుడు మంత్రిత్వ విస్తరణ అవకాశం కూడా లేదని తెలిపోయింది. తాము వుట్టి భద్రయ్యలుగా వుండిపోవాల్సిందేనన్న నిస్పృహ ప్రతి ఎమ్మెల్యేలో కనిపిస్తున్నది. పార్టీకి ఎంత సేవ చేసినా, చంద్రబాబు కొలువు ఎంత కొలిచినా అదనంగా ఒరిగేది ఏదీ వుండదన్న నిరసన ప్రబలి పోతున్నది వీరిలో. అయితే దాన్ని బయటకు చెప్పుకునే ధైర్యం మాత్రం ఎవరిలోనూ లేదు.

మంత్రిత్వాలు ఇక రావు అనే నిర్ణయానికి వచ్చిన ముఖ్యులలో కాళహస్తి గోపాలకృష్ణారెడ్డి, నరసారావుపేట శివప్రసాద్, డిప్యూటీ స్పీకర్ చంద్రశేఖర్ చెప్పుకోదగిన వారు. మొదటి ప్రమాణ స్వీకారంలోనే తమకు అవకాశం ఇవ్వనందుకు వీరు మండిపడ్డారు. అప్పటినుండి చంద్రబాబు వీరిని ఇంతకాలం బుజ్జగిస్తూ వచ్చారు. అప్పుడప్పుడు పిలవడం, మనసుకు నచ్చినట్లు మాట్లాడడం, మధ్యవర్తులను పంపి దువ్వడం వంటి పనులు చేస్తుండినాడు. మొదట తమను నిర్లక్ష్యం చేసినా మళ్లీ విస్తరణలో అవకాశం ఇచ్చి తీరుతాడు అని భావిస్తుండినారు వీరు. కాని ఇప్పుడు దారులు మూసుక పోయాయి. ఇక ఇప్పటిలో మంత్రిత్వాలకు తలుపులు తెరిచే అవకాశం లేదు అన్న సంగతి తెలిపోయిన తర్వాత వీరి ప్రవర్తన ఎట్లా వుంటుందో చెప్పలేము. రాజకీయ పరిశీలకుల దృష్టి అంతా ఇప్పుడు వీరి ముగ్గురిపై వుంది.

నిజానికి ఇప్పటిలో వీరు చేయగల్గింది ఏదీ లేదు అన్నది వాస్తవం. వీరిని నమ్మి తతిమా ఎమ్మెల్యేలు ఎవరు కూడా ముఖ్యమంత్రిపై విమర్శలు చేసే పరిస్థితి లేదు. ఏరుదాటిన తర్వాత తెప్ప తెగలేసే రకం అని వీరికి పేరు. ఒకవేళ తాము తొందరపడి, వీరి వెనుక చేరి కొంత అలజడి సృష్టిస్తే, దాన్ని అడ్డం పెట్టుకుని, ముఖ్యమంత్రిని బ్లాక్ మెయిల్ చేసి, తమ అవసరాలు గడుపుకుని, ఆ తర్వాత తమను గాలిలో వదిలేస్తారన్న

కొరవ 7వ పేజీలో

# తాళ్ల'పాక'కు కౌన్సిల్ రిక్విజేషన్ 'నిప్పు'

నెల్లూరు మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధ, ఆమె భర్త రమేష్‌రెడ్డి ప్రత్యర్థుల కోసం తీసిన గోతిలో తామే పడ్డారు. షాదీమంజిల్ ప్రారంభోత్సవ వివాదంపై మంగళవారం జరిగిన కౌన్సిల్ సమావేశం తాళ్లపాక నదీ. పతులకు చెంప పెట్టయ్యింది. రొచ్చు రాజకీయాల రొంపి నుంచి ఇకనైనా బయటపడి ప్రజా సమస్యల పరిష్కారానికి నడుంకడితే ప్రజలు హర్షిస్తారు. లేదంటే జనం బాధలు పట్టించుకోని కౌన్సిలర్లతో సహా అందర్నీ చీపుర్లతో చావబాదే రోజు దగ్గర్లోనే వుంది.

షాదీ మంజిల్ ప్రారంభోత్సవ వివాదంలో, మంత్రి ఆదాల ప్రభాకర్‌రెడ్డి, షాదీ మంజిల్ ప్రారంభోత్సవంపై కాంగ్రెస్ కౌన్సిలర్లు ఇచ్చిన రిక్విజిషన్ నోటీసును ఛైర్‌పర్సన్ అనూరాధ మొదట కమీషనర్ అభిప్రాయం కోసం పంపారు. ఈ వ్యవహారంలో ఛైర్‌పర్సన్ తనను ఇరికిస్తుందేమోనన్న భయంతో కమీషనర్, ఎటువంటి వ్యాఖ్యలు చేయకుండానే ఆ నోటీసును ఛైర్‌పర్సన్‌కు పంపేశారు. దీంతో విధిలేని పరిస్థితుల్లో రిక్విజిషన్ నోటీసుపై తాను కౌన్సిల్‌ను సమావేశపరచనని ఛైర్‌పర్సన్ సమాధానం పంపేసింది. దీంతో సమావేశ నిర్వహణకు కాంగ్రెస్ కౌన్సిలర్లే నడుంకట్టి, కమీషనర్‌కు ఆ విషయం తెలియజేశారు. కౌన్సిల్ కోరంకు అవసరమైన 16 మంది రిక్విజేషన్ సమావేశాన్ని నిలపాలని, మున్సిపల్ మంత్రి ద్వారా 'స్టే' పొందాలని ప్రయత్నించి భంగపడ్డారు. కోర్టు ద్వారా అడ్డుకోవాలని భగీరథ ప్రయత్నం చేసి విఫలమయ్యారు. చివరకు షాదీమంజిల్ ప్రారంభోత్సవంపై తాము పెట్టిన పిటీషన్ తప్పుడుదని మున్సిపల్ డైరక్టర్ ముందు ఒప్పుకుంటామని రాజీ ప్రతిపాదన కొచ్చారు. అదేదో రాత పూర్వకంగా ఇవ్వమని కాంగ్రెస్ కౌన్సిలర్లు అడగడంతో నిరాకరించారు. దీంతో మంగళవారం నాటి రిక్విజేషన్ సమావేశానికి కాంగ్రెస్ సన్నద్ధమైంది. ఈ వ్యవహారంలో మంత్రి ఆదాల ప్రభాకర్‌రెడ్డిని ఇరికించి, అభాసుపాలు చేయడంతో, తెలుగుదేశం పార్టీలో ఆయనకు అనుకూలురైన కౌన్సిలర్లు కూడా సమావేశానికి వచ్చేందుకే నిర్ణయించుకున్నారు. వారిని, నిలువరించాలని జిల్లా తెలుగుదేశం అడ్‌హాక్ కమిటీ కన్వీనర్ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ముందు మోకరిల్లాడు. మంత్రిని షాదీమంజిల్ వివాదంలో ఇరికించి, తన వద్దకు వస్తే లాభం ఏమిటని ఆయన రమేష్‌రెడ్డిని నిలదీశారట. ఈ విషయంలో తాను అసహాయుడనని చేతులెత్తేశారు. దీంతో, మంగళవారం నాడు కాంగ్రెస్‌కు చెందిన 16 మంది కౌన్సిలర్లు, ఇద్దరు ఎక్స్‌అఫీషియో సభ్యులైన ఎమ్మెల్యేలు 'ఆనం బ్రదర్స్' తెలుగుదేశం పార్టీకి చెందిన శ్రీధరకృష్ణారెడ్డి, బుజ్జయ్య, నూనె మల్లిఖార్జునయాదవ్, చంద్రశేఖర్, బాషా, కిన్నెర ప్రసాద్ రిక్విజేషన్ సమావేశానికి హాజరయ్యారు నవంబర్ 4వ తేదిన ఆదాల ప్రభాకర్‌రెడ్డి ప్రారంభించిన కార్యక్రమాలన్నీ అధికారికమైనవేనని ఏకగ్రీవంగా తీర్మానించారు.

కాంగ్రెస్ పార్టీకి చెందిన ఇద్దరు కౌన్సిలర్లు బాలసుధాకర్, సల్మాబషీర్‌లు పదవులు పోతాయన్న భయంతో రిక్విజేషన్ సమావేశానికి డుమ్మా కొట్టేశారు. మంత్రి వర్గీయుల్లో కాకర్ల గురవయ్య కూడా సమావేశానికి రాలేదు. కోటంరెడ్డి ఉభయతారక రాజకీయోప జీవి కాబట్టి 'ఆనం' వ్యతిరేకత అన్న అస్త్రాన్ని అడ్డం పెట్టుకొని రిక్విజేషన్ సమావేశం జరగనియకుండా రమేష్‌రెడ్డి తరఫున ఆయనే సారథ్యం వహించి చివరకు విఫలమయ్యారు. అందువల్ల పదహారణాల మంత్రి వర్గీయుడుగా రిక్విజేషన్ సమావేశానికి గైర్‌హాజరయ్యింది గురవయ్య ఒక్కడే.

రిక్విజేషన్ సమావేశంలో మంత్రి ఆదాలను సమర్థిస్తూ, శ్రీధరకృష్ణారెడ్డి దబాయించి మాట్లాడాడు. మంత్రి హోదాలో ఆయన చేసిన ప్రారంభోత్సవాలు అనధికారికమనే హక్కు, అధికారం ఎవరికీ లేదన్నాడు. ఈ విషయమై కౌన్సిల్ ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి తీర్మానం చేయాల్సిన పరిస్థితి రావడం దురదృష్టకరమని విమర్శించాడు. ఛైర్‌పర్సన్ అనూరాధను సుతి మెత్తంగా మాటల ఈటెలతో పొడిచాడు. కాంగ్రెస్ పార్టీ తరఫున చాట్ల నరసింహారావు మాట్లాడుతూ షాదీమంజిల్ ప్రారంభోత్సవం కౌన్సిల్‌కు తెలిసే జరిగిందని, దానికయ్యే ఖర్చును కూడా ఛైర్మన్ మంజూరు చేసిందన్నారు. ఈ కార్యక్రమంలో కమీషనర్‌తో సహా, 30 మంది

తరువ 11వ పేజీలో

## నేతల్లారా! ఇకనైనా తగాదాలు ఆపలేరా?

వైస్ ఛైర్మన్ సందానీబాషాలను రచ్చకీడ్చి రమేష్‌రెడ్డి అనూరాధలు తమకు తామే రాజకీయంగా తలకొరివి పెట్టుకున్నారు. రిక్విజేషన్ నోటీసుపై ప్రతిపక్ష కౌన్సిలర్ల ఆధ్వర్యంలో కౌన్సిల్ సమావేశం జరగడం అధికారపార్టీ కౌన్సిలర్లు దానికి హాజరుకావడం బహుశా మున్సిపల్ చరిత్రలో నెల్లూరులోనే తొలిసారి జరిగి వుంటుంది. షాదీమంజిల్ ప్రారంభోత్సవం అధికారికంగానే జరిగిందనడానికి స్పష్టమైన ఆధారాలున్నా, దీనిపై పిటీషన్ పెట్టి ఆమె కందిరీగల తుట్టెను కదిలించినట్టయ్యింది. దీంతో మంత్రి ఆదాలను ఇరికించి సొంత పార్టీలోనే కుంపటి రాజేసింది. ఈ సెగతో కాంగ్రెస్ పార్టీ చలి కాచుకుంటోంది. కౌన్సిలర్ల సంతకాలు చేయడంతో చట్ట ప్రకారం రిక్విజేషన్ సమావేశానికి మంగళవారం ముహూర్తం నిర్ణయించారు.

కౌన్సిల్ రిక్విజేషన్ సమావేశం జరగనీయకుండా చెయ్యాలని రమేష్‌రెడ్డి నానా తంటాలుపడ్డాడు. సమావేశానికి హాజరయితే, కౌన్సిల్ రద్దు కావడం ఖాయమని ఒకసారి, సమావేశానికి పోయిన కౌన్సిలర్ల పదవులు పోతాయని మరొకసారి పుకార్లు లేవదీశాడు. మంత్రివర్గీయుడుగా చెప్పుకొంటున్నా, అన్ని వ్యవహారాల్లో తనకు అండగా నిలిచే కౌన్సిలర్ కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డిని అడ్డంపెట్టుకొని కౌన్సిలర్ల అందరిళ్లకు పోయి, రిక్విజేషన్ సమావేశానికి పోవద్దని ప్రాధేయపడ్డాడు.



# సణుగుడు

* ఎమ్పీ గారి నిష్ఠూరాలు!
* పిల్లల పార్కు పాడు పెట్టేస్తారా?

నెల్లూరు ఎమ్పీ శ్రీమతి రాజేశ్వరమ్మ గారు చాలా నిష్ఠూర పడుతున్నారు; మా ముఖాన మెటికలు విరుస్తున్నారు. ఆమె మనసు కష్టానికి కారణం - మూడు వారాల క్రితం ఇదే శీర్షికలో ప్రచురితమైన ఒక వార్తాకథనం. ఎమ్పీ గారు తమ తండ్రి పేరు, ప్రతిష్టలు పాడు చేస్తున్నారని, తన పదవి హోదాను భంగ పరచుకుంటున్నారని అందులో వ్రాశాము. డబ్బు కక్కుర్తితో ఎమ్పీ నిధుల పథకం క్రింద చేపట్టే పనులకు కమీషన్లు కోరుతున్నారని, రైల్వే కాంట్రాక్టర్లను పర్సంటేజీ ప్రకారం తనకు కొంత ముట్ట చెప్పమని అడుగుతున్నారని ఆ వార్తలో వెల్లడించాము. రాజకీయ వాదులకు తమ తప్పులు ఎవరైనా ఎత్తి చూపితే ఎక్కడలేని కోపం వస్తుంది. తప్పులు చేయడం తమ హక్కు అన్నది వారి భావన. ఇతరులెవరికీ వాటిని తప్పులుగా భావించే అధికారం లేదన్నది వారి నమ్మకం. రాజేశ్వరమ్మ గారు కూడా రాజకీయవాదే కదా? ఆమె సైతం ఆ కోవలోనే ఆలోచించడంలో తప్పులేదు.

తాను కమీషన్లు తీసుకున్నట్లు, పర్సంటేజీలు అడిగినట్లు నిరూపిస్తే రాజకీయ సన్యాసం స్వీకరిస్తానని సవాలు విసిరారామె. ఇదీ షరా మామూలు ప్రకటనే. ప్రతి రాజకీయవాది చెప్పే మాటలే ఇవి. దొంగతనం చేసిన వాడిని స్టేషన్‌కు లాక్కెళ్లి, లాకప్‌లో పెట్టి, లాఠీలతో చావకొడితే కూడా తాను దొంగనని ఒప్పుకోడు. కేవలం పత్రికలలో వార్తలు రాగానే, రాజకీయవాదులు ఆత్మ విమర్శ చేసుకుని, నిజాయితీగా తమ దోషాలు అంగీకరించి, చెంపలు వేసుకోవడానికి ఇదేమీ సత్తెకాలం కాదు. దొరికినంత వరకు అందరూ దొరల క్రింద లెక్క. రాజకీయవాదులు దొరికే అవకాశం లేదు కాబట్టి ఎప్పటికీ దొరలుగానే చలామణి అవుతారు. ఏదో ఖర్మ చాలక జయలలిత, లల్లూ ప్రసాద్ యాదవ్ వంటి వారు కోర్టులకు, జైళ్లకు వెళ్తున్నారు తప్ప, ఈ దేశంలో అవినీతికి పాల్పడి, దొరికిపోయిన వారు ఎందరున్నారు చెప్పండి!

తాను కమీషన్లు తీసుకున్నట్లు రుజువు చేయమంటున్నారు ఎమ్పీ గారు. అది మా తరం ఎట్లా అవుతుంది? చిన్న చిన్న కాంట్రాక్టర్లు, ఉద్యోగులు ఎమ్పీ వంటి వున్నత పదవిలో వుండే రాజకీయ వాదిపైన ఫిర్యాదు చేయడం వూహించే విషయమా? ఇటువంటి ఆరోపణలకు ఆధారాలు చస్తే దొరకవు. ఆ ధైర్యం ప్రగాఢంగా వుంది కాబట్టే, ఆమె మాకు అంత పెద్ద సవాలు విసర గల్గారు. అయితే వార్తలు వ్రాయడం తప్ప విచారణ జరిపి, రుజువులు, సాక్ష్యాలు సేకరించి, నిరూపణలు చేయడం పత్రికల పని కాదు. తాను అంతటి నచ్చీలురాలు అనే నమ్మకం ఆమెకు వుంటే రాజేశ్వరమ్మ గారు తనంతట తానుగా ప్రభుత్వాన్ని లేదా ఏదైనా స్వచ్ఛంద సంస్థను కోరి తనపై వచ్చిన ఆరోపణలపై విచారణ జరిగేట్లు చూస్తే - నిజం బయటపడుతుంది.

మా వుద్దేశ్యం రాజేశ్వరమ్మ గారిని కష్టపెట్టాలన్నది కాదు. కాని దేముడిచ్చిన వరం వలె, అనుకోకుండా నెల్లూరు జిల్లా ప్రజల ప్రతినిధిగా పార్లమెంట్ వరకు వెళ్లగల్గిన భాగ్యం ఆమెకు లభించింది. ఇటువంటి అవకాశాలు సద్వినియోగం చేసుకుంటే చరిత్రలో మంచి పేరు నిలిచి పోతుంది. అవకాశం దొరికింది కదా అని అందినంత జవురుకోవాలని ప్రయత్నిస్తే చరిత్ర హీనురాలిగా మిగిలి పోవల్సి వస్తుంది అని హెచ్చరించడం వరకే మా వ్యాఖ్య వుద్దేశ్యం. ఇటువంటి సవాలు విసిరినంత మాత్రాన తన సత్య సంధత నిరూపణ కాదని, స్వచ్ఛంగా వ్యవహరిస్తేనే ప్రజలలో తాను నచ్చీలురాలన్న విశ్వాసం కల్గుతుందని రాజేశ్వరమ్మ గారు గ్రహిస్తే - ఆమెకే మంచిది.

***

అబ్బ పుణ్యాన బావి తవ్విస్తే, కొడుకొచ్చి పూడ్చి పారేస్తున్నట్లుంది పిల్లల పార్కు వ్యవహారం. చింతారెడ్డిపాళెం రోడ్డో పాత కలెక్టర్ శ్రీలక్ష్మి ఎంతో శ్రమ తీసుకుని నిర్మించిన పిల్లల పార్కును పాడు పెట్టేస్తున్నాడు ఇప్పటి కలెక్టర్ ప్రవీణ్‌కుమార్.

ఈ పార్కు కోసం శ్రీలక్ష్మి పడిన శ్రమ అంతా ఇంతా కాదు. స్థలం ఎంపిక నుంచి రిబ్బను కత్తిరింపు వరకు ప్రతి

**డోలేంద్ర**

విషయం స్వయంగా చూశారు. ఆ ఆరు నెలల కాలం అదే లోకంగా గడిపారు. ఆమెను మించిన కష్టం జె.ఎస్.రెడ్డి గారిది. సుఖంగా బెంగుళూరులో గడిపే ఆయన పార్కు నిర్మాణం కోసం నెలల తరబడి నెల్లూరులో మకాం పెట్టారు; పార్కులో కల్పించవల్సిన సౌకర్యాలు అధ్యయనం చేయడం కోసం ఎక్కడెక్కడో తిరిగాడు. కేవలం ప్రభుత్వ కార్యక్రమంగా కాకుండా, తన స్వంత ఇల్లు కట్టుకొంటున్నట్లు శ్రమపడ్డాడు; లక్షల రూపాయల డబ్బు ధారాళంగా ఖర్చు పెట్టాడు. ఇందులో ఆయన స్వలాభం ఎంత మాత్రం లేదు. కనీసం పార్కుకు తన పేరు పెట్టమని కూడా అడగలేదు. పేరుకోసం నెల్లూరులో పెద్ద రచ్చ జరిగినా నిర్లిప్తంగా వుండి పోయాడు. కనీసం ప్రారంభోత్సవం రోజు కూడా తన పెత్తనం వుండాలని కోరుకోలేదు. నెల్లూరుకు ఒక మంచి పని చేయాలనుకొన్నాను, చేశాను అని చెప్పి తెర వెనక్కు వెళ్లిపోయాడు.

శ్రీలక్ష్మి విషయంలోనూ స్వార్థం ఏదీ లేదు. నెల్లూరు ఆమె వూరు కాదు; ఈ పార్కు కట్టించినందుకు మెచ్చి మేకతోలు కప్పే వారు ఎవరూ లేరు. తలపెట్టిన పని పూర్తి చేసివెళ్లాలన్న పట్టుదల, చేసే పనిలో విశిష్టత చూపాలన్న చిత్తశుద్ధి తప్ప ఆమెకు దీని వల్ల వొరిగే మేలు ఏమి వుంది?

వీరిద్దరి కష్టం, శ్రమ ఫలించి పార్కు చాలా గొప్పగా రూపుదిద్దుకొన్నది. మద్రాసు, హైదరాబాద్ నగరాలలో కూడా

తరువ 7వ పేజీలో

# అమరజీవి ఎన్‌జి రంగా!

ఆచార్య రంగాగారి శత జయంతి ఉత్సవాలు ప్రారంభ మైనాయి. మొన్న ఏడో తేదితో ఆయనకు శత సంవత్సరాలు నిండాయి. రంగాగారు ఈనాడు మన మధ్య లేరు. ఆ లోపం కేవ లం భౌతికపరమైంది మాత్రమే. ఆయన రూపం కన్పడకపోయినా ఆయన స్ఫూర్తి మన మనసులలో సజీవంగానే వుంది; ఇక ముందు కూడా వుంటుంది. ఆయన అమర జీవి; రంగా వంటి వ్యక్తులకు మరణం వుండదు. అందుకు కారణం వారు మనవలె మామూ లు వ్యక్తులు కారు. మనవంటి వారి జీవితాలలో వెలుగు నింపడా నికి తమ జీవితాలను హారతి కర్పూరం వలె కరిగించిన త్యాగ జీవులు.

భారత రాజకీయ, ఆర్థిక, గ్రామీణ జీవన పరిస్థితులపై రంగా గారి ప్రభావం ఎంత వుందో అంచనా కట్టడం అసాధ్యం. మహా త్మాగాంధీ వలె ఆయన ప్రజా జీవితాలను చైతన్యపర్చలేక పోయి వుండవచ్చు; జవహర్‌లాల్ నెహ్రూ వలె ఆయన దేశ పరిపాలనా బాధ్యత స్వీకరించి వుండక పోయి వుండవచ్చు; జయప్రకాష్ నారా యణ్ వలె ఆయన సామాజిక విప్లవానికి నేతృత్వం వహించక పోయి వుండవచ్చు. ఇవేవీ చేయ కున్నా, భరతమాత సేవలో రంగా గారి పాత్ర గాంధీ, నెహ్రూ, జయ ప్రకాష్ నారాయణలకు ఎంత మాత్రం తీసిపోదు. అతిశయోక్తి కోసం చేస్తున్న ఉదాహరణలు కావు ఇవి. రంగా గారి జీవితాన్ని వర్ణించ డానికి ఎటువంటి అతిశయోక్తులు అవసరం లేదు.

రంగా గారి జీవితాన్ని రేఖా మాత్రంగా ప్రస్తావించాలన్నా ఈ శీర్షిక చాలదు; ఈ పత్రిక మొత్తం అందుకు కేటాయించినా పదోవంతు అవసరం తీరదు. ఆయన జీవితం ఒక వుద్గ్రంధం; ప్రజా జీవితంలో వుండదల్చిన ప్రతిఒక్కరు విధిగా పాటించి తీరవల్సిన మహోత్కృష్ట పుస్తకం. ప్రజానాయకుడు అనే పదానికి ఆయన జీవితం ఒక సజీవ నిర్వచనం. దాదాపు డెబ్బై ఐదు సుదీర్ఘ సంవత్సరాలపాటు ఆయన ప్రజల మధ్య గడిపాడు; ప్రజలకోసం బ్రతికాడు; ప్రజల మేలు మాత్రమే పలవరించాడు. అందుకోసం పదవులు ఆశించలేదు; పలుకుబడి కోసం పాకులాడలేదు; తన సేవకు విలువ కట్టలేదు; కనీసం తనకు గుర్తింపు రావాలని ప్రతిపాదించ లేదు. నిస్వార్థ సేవ, త్యాగమయ రాజకీయం, సాహసోపేత వుద్యమాల నిర్వహణ, ప్రాణాలను సైతం లెక్క చేయని నిబద్ధత, నమ్మిన సిద్ధాంతం పట్ల చిత్తశుద్ధి, దాని ఆచరణను సర్వం వొడ్డి పోరాడే పరాక్రమం రంగా గారి విశిష్ట లక్షణాలు.

ఆయన ప్రజా జీవితమంతా వుద్యమాల మయమే. జమిందారీ వ్యతిరేక ఉద్యమంతో ప్రారంభమ య్యింది ఆయన జీవన పోరాటం. అందుకోసం పల్లెలు తిరగడంలో భారత గ్రామీణ ప్రజల దుర్భర జీవితాలు ఆయన హృదయాన్ని కదిలించి వేశాయి. అక్కడ్నుంచి తుది శ్వాస విడిచే వరకు ఆయన ఏ పని చేసినా రైతుల కోసం చేశాడు; రైతుల జీవన పరిస్థితులు బాగుపరచడానికి తపించాడు.

రంగాగారు కోరి వుంటే 1949లో ఏర్పడిన నెహ్రూ తొలి మంత్రివర్గంలోనే కీలకమైన మంత్రి త్వం లభించి వుండేది. కేంద్ర మంత్రి పదవి మాత్రమే కాదు, ఆ తర్వాత ఆయనకు వివిధ సందర్భా లలో లోక్‌సభ స్పీకర్ పదవి, రాష్ట్ర పతి పదవి కూడా ఇవ్వ జూపారు. కాని రంగా గారు స్వీకరించలేదు. ఆయన దృష్టి ఎప్పుడూ ప్రజల మేలు కోసం చేయవల్సిన నిర్ణ యాలు, అనుసరించవల్సిన విధా నాలపైనే వుండేది. సర్దార్ పటేల్ గతించిన తర్వాత జవహర్‌లాల్ నెహ్రూ దేశ పాలనలో ప్రవేశపెట్టిన సోషలిస్ట్ విధానాలను రంగా గారు తీవ్రంగా వ్యతిరేకించారు. దాని ఫలితమే స్వతంత్ర పార్టీ ఆవిర్భా వం. ఇప్పుడు ప్రతి జాతీయ నేత గొప్పగా చెప్పుకుంటున్న ఆర్థిక సరళీకరణ రంగా గారు నలభై ఏళ్ల క్రితమే ప్రవచించారు. లైసెన్స్, పర్మిట్ రాజ్ వల్ల దేశ ప్రగతి తిరోగమిస్తున్నదని, అవినీతి పెరిగి పోవడానికి అది కీలక కారకమని రంగా గారు పార్లమెంట్‌లో ఎన్నిసా ర్లు ప్రభుత్వాలను హెచ్చరించారో లెక్కలేదు. కేంద్రంలో అధికారంలో వున్న ప్రతి ప్రభుత్వం కూడా రైతులను నిర్లక్ష్యం చేస్తున్నదని ఆయన ఆవేదన చెందేవారు. రాజకీయాలలో కేవలం చదువుకున్న మేధావులు మాత్రమే పెత్తనం చేసే పరిస్థితి పోగొట్టడానికి ఆయన స్వయంగా రాజకీయ శిక్షణా తరగ తులు నడిపారు. గ్రామీణ ప్రాంతా లకు చెందిన యువకులు, రైతు కుటుంబీకులు పరిపాలన పగ్గాలు చేపడితే తప్ప గ్రామీణ సమస్యలు పరిష్కారం కావన్నది ఆయన నమ్మకం. దక్షిణ భారత దేశంలో మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా ఎదిగిన పలువురు నేతలు రంగా గారి నుంచి పాఠాలు నేర్చుకున్న వారే. రంగా గారి రాజకీయ పాఠశా లలు ఉత్తర భారత దేశంలో కూడా పలువురు నేతలను తయారు చేశా యి. కాంగ్రెస్ పార్టీ రైతులకు

జమీన్‌రైతు

సంబంధించి చేసే నిర్ణయాలలో లోటుపాట్లు కన్పడినప్పుడు రంగా గారు నిర్భయంగా ఎదిరించేవారు. మహాత్మాగాంధీతో కూడా పలుమార్లు ఆయన ఈ విషయంలో వాదోప వాదాలకు దిగేవారు.

రైతుల పరిస్థితులపైన, గ్రామీణ జీవితంపైన రంగా గారు వ్రాసిన పుస్తకాలు ప్రామాణిక గ్రంథాలుగా పరిగణింప బడు తున్నాయి. ఆయన మహావక్త. వేదిక ఎక్కితే ఆయన ప్రసంగంలోని వేగం అందుకోవడానికి బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారులు నానా అవస్థలు పడేవారట. మద్రాసు గవర్నర్ ఆ రోజులలో రంగా గారి ప్రసం గాలు వ్రాసి, నివేదిక తయారు చేయడానికి ప్రత్యేక అధికారులను నియమించే వాడట. ఆయన పత్రికా సంపాద కుడు కూడా. తెలుగులో, ఇంగ్లీ షులో ఆయనకు సమ పాండిత్యం వుండేది. దేశ చరిత్ర, సంస్కృతి, ఆర్థిక పరిస్థితులు, ప్రజల జీవన విధానం తదితరాలపై ఆయన విషయ పరిజ్ఞానం అపారం. పార్ల మెంట్‌లో ఆయన చేసిన ప్రసం గాలు రాజనీతి శాస్త్రం చదివే విద్యార్థులకు విజ్ఞాన ఖని వలె వుపయోగ పడుతున్నాయి. నీతి, నిర్భీతి, స్వచ్ఛత, సచ్ఛీలం, నిస్వా ర్థత, నిష్కాపట్యం రంగా గారి విశిష్ట లక్షణాలు.

ఎక్కడ ఒక రైతు సోదరుడు ప్రభుత్వ నిర్ణయాల వల్ల బాధలు పడినా రంగా గారి హృదయం బాధతో చలించి పోయేది. ఆ రైతును స్వయంగా పరామర్శించి, కళ్ల నీళ్లు తుడవడానికి తాపత్ర యపడేవాడు ఆయన. ఇప్పుడు మన రాష్ట్రంలో రోజుకు ఒక నిర్భా గ్య రైతు ఆత్మహత్య చేసుకుం టున్నా చీమ కుట్టినట్లు కూడా భావించని హృదయం లేని రాష్ట్ర ప్రభుత్వానికి రంగా గారి శతజ యంతి జరిపే నైతిక హక్కు లేదు. రంగా గారికి కావాల్సింది శతజ యంతి సంబరాలు, వూక దం పుడు వుపన్యాసాలు కాదు; ఆయన పట్ల ప్రభుత్వ నేతలకు నిజమైన భక్తి వుంటే చేయవల్సిన పని బ్రతకడం వ్యర్థం అనే నిస్పృహతో ప్రాణాలు బలిపెట్టుకుంటున్న రైతుల జీవితాలను మెరుగు పర్చడం మాత్రమే. రంగా గారి స్మృతికి అంత కంటే గొప్ప నివాళి వేరొకటి వుండదు.

జమీన్‌రైతు

10.11.50

వెల: 0-3-0 పేజీలు: 12

### నెల్లూరులో జైప్రకాష్ నారాయణ్

అఖిల భారత సోషలిస్టు నాయకుడు జయప్రకాష్ నారాయణ్ 3తేది నుండి నాలుగు రోజుల పాటు నెల్లూరు జిల్లాలో సంచరించారు. పొదిలి, కనిగిరి, కందుకూరు, కావలి, అల్లూరు, బుచ్చి, చూచుకొని 5తేది సాయంత్రం నెల్లూరు విచ్చేశారు. టౌన్‌లో పెద్ద ఉత్సవం. కాలేజి మైదానంలో బ్రహ్మాండమైన సభ జరిగాయి. 6తేది ఉదయం కోవూరు పోయివచ్చి, మధ్యాహ్నం 2 గంటలకు శ్రీ కస్తూరిదేవి విద్యాలయాన్ని సందర్శించి, తదుపరి పొదలకూరు, గూడూరుతోపాటు జిల్లా సంచారం 6తేది సాయంకాలంతో పూర్తి జేశారు. ఆంధ్రప్రదేశ్ సంచారంలోని ఒక భాగమే నెల్లూరు జిల్లా పర్యటన. ఇది పార్టీ నిర్మాణానికి, ఎన్నికల ప్రచారానికి వుద్దేశింపబడింది.

### నెల్లూరు ఎలక్ట్రిసిటీ

నెల్లూరు పవర్ అండ్ లైట్ కంపెనీతో విసిగి వేసారిన నెల్లూరు పౌరులకు ప్రభుత్వ థర్మల్‌స్టేషన్ రావడం ఒక వరప్రసాదమనుకొన్నారు. కాని, కరెంటు ఉత్పత్తి ప్రభుత్వానిదైనా, పంపకం ఇది వరకటి కంపెనీకే ఇవ్వ డం మూలంగా టౌన్ లైటింగు, రేటు, ఈ అన్ని ఇబ్బందులూ అట్లనే వుండి పోయాయి. దీనివల్ల ప్రజల డబ్బుతో నిర్మించిన థర్మల్ స్టేషన్ లాభాలను ప్రజలు పొందడానికి బదులు, మధ్య

50 ఏళ్ల క్రితం నాటి

దళారీ పొందుతున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు

### బుచ్చి - నాయకులు

ఇంగ్లండులో ప్రభుత్వాలను సాగించే నాయకులంతా ఏ కొద్ది మంది పెద్ద కుటుంబాల వారుగానే వున్నా రనేది విజ్ఞులకు తెలియనదికాదు. అట్లనే మన జిల్లాలో కూడా బుచ్చిలోని ఒకటి రెండు కుటుంబాల వారు నాయకత్వం వహిస్తున్నారు. జస్టిస్ పక్ష ప్రాబల్యంలో దొడ్ల కుటుంబీకుడు బెజవాడ రామచంద్రారెడ్డి గారు

తరువాయి 10వ పేజీలో

# జనవాణి

## ఎందుకీ! కయ్యాలమారి మున్సిపాలిటీ

నెల్లూరు మునిసిపాలిటి వుండి ఒకటే - లేక ఒకటే. మునిసిపల్ సమా వేశాల్లో దూషణ, భూషణలు తప్పితే కాసింత అభివృద్ధి కనపడడం లేదు. కౌన్సిలర్ల రాజకీయం కుక్కలు చింపిన విస్తరి మాదిరి తయారయ్యింది. కాబట్టి, అధికారులు బ్లాక్‌మెయిలింగ్‌కు మల్లుకొ న్నారు. కౌన్సిలర్లు అనుభవ రాహిత్యంతో మునిసిపల్ టౌన్ ప్లానింగ్ అధికారులను సభలో లంచగొండులన్నారు. ఈ వ్యవ హారం ఎంత వరకు వెళ్తుందోనని భావిం చి కమీషనర్ తెలివిగా తన సహచర అధికారులను బయటకు తీసుకెళ్లి పోయారు. మునిసిపాలిటి గబ్బుపట్టి పోవడానికి కౌన్సిలర్లు, ఛైర్మన్, అధికా రులు అందరు తమ వంతు కృషి తాము చేశారు. రాజకీయ విభేదాలు, వర్గ కక్షల మధ్య మునిసిపాలిటిలో ఇక ఎటువంటి అభివృద్ధి పని జరిగే అవకాశమే లేదు. అందువల్ల నెల్లూరు మునిసిపాలిటీని రద్దు చేయడమే ఉచితం.

నెల్లూరు టి.వి.నారాయణ

### వీళ్లు పిసిసి సభ్యులా?

జిల్లాలో పిసిసి ప్రతినిధుల లిస్టు చూసిన తర్వాత జిల్లాలో కాంగ్రెస్ పార్టీ ఇంతగా భ్రష్టుపట్టి పోయిందా అనిపిస్తుంది. ఈ లిస్టులో వున్న కొందరు, పనికి మాలినవారు. పోయిన అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి ఎంతగానో నష్టం కల్గించారు. అటువంటి వారిని పిసిసి ప్రతినిధులుగా ఎంపిక చేసినం దున, జిల్లాలో ఇక కాంగ్రెస్ పార్టీకి మోక్షం లేదనిపిస్తుంది. ప్రకటించిన పిసిసి సభ్యు ల జాబితాలో కొందరు సూడో కాంగ్రెస్ వాదులున్నారు. పార్టీ కోసం, కార్యకర్తల కోసం పనిచేసే జి.కె.రెడ్డి, పందిళ్లపల్లి అరుణమ్మ, పత్రా ప్రకాశరావు వంటి వ్యక్తుల పేర్లు ఈ జాబితాలో చోటు చేసుకోక పోవడం బాధాకరం.

హైదరాబాద్ కె.వి.రమణారెడ్డి

### ఆర్‌ఎస్‌ఎస్ చాలా గొప్ప సంస్థ

జమీన్‌రైతు జనవాణి శీర్షికలో ప్రచురితమైన ఆర్‌ఎస్‌ఎస్ లక్ష్యం వినాశ నమేనా? అన్న ఉత్తరం చదివాక ఈ లేఖ వ్రాయాలనిపించింది. ఆర్‌ఎస్‌ఎస్ ఒక స్వచ్ఛంద సంస్థ. ఇది జగద్విదితమైన సత్యం. దీని లక్ష్యం హిందూ సంఘటన అనే కంటే "భరతమాత నా తల్లి,

తరువాయి 10వ పేజీలో

# నెల్లూరుట్రాఫిక్‌పై ఎస్పీకసరత్తు

నెల్లూరు టౌన్‌లో ట్రాఫిక్ సమస్య పరిష్కారం కోసం ఎస్పీ శ్రీనివాసరెడ్డి ఒక పటిష్టమైన కార్యాచరణ ప్రణాళికను రూపొందించి అమలు చేస్తున్నారు. గతంలో ఏ కొత్త ఎస్పీ వచ్చినా పార్కింగ్ స్థలాలు, వన్‌వే ట్రాఫిక్‌లు మార్పుతం

## నెల్లూరుసంగతులు

తప్ప చిత్త శుద్ధితో ట్రాఫిక్ సమస్యకు మూలకారణం గుర్తించలేదు. కొత్త ఎస్పీ మాత్రం జాయింట్ కలెక్టర్‌తో రెండు మూడు రోజులు టౌనంతా తిరిగి, వచ్చిపోయేవారితో మాట్లాడి, ఆక్రమణల తొలగింపులకు స్వయంగా పూనుకున్నారు. రెవిన్యూ, మున్సిపల్ అధికార్లను వెంటెనుకొని ఆక్రమణల తొలగింపులను పర్యవేక్షిస్తున్నారు. వాహనాలు వేగంగా వెళ్లడం, అడ్డదిడ్డమైన ఆక్రమణలు ప్రమాదాల సంఖ్యను పెంచుతున్నాయన్న నిర్ణయానికి వచ్చి 6వతేదీ నుంచి పట్టణంలో ఆక్రమణల తొలగింపుకు శ్రీకారం చుట్టారు. ఇద్దరు ఉన్నతాధికార్లు దగ్గరుండి ఆదేశాలు జారీ చేస్తుండడంతో రెవిన్యూ, మునిసిపల్, పోలీసు అధికారులు సంయుక్తంగా దురాక్రమణల తొలగింపుకు నడుంకట్టారు. దీని మూలంగా ఏఆర్ కాలేజి మొదలు పొట్టి శ్రీరాములు బొమ్మకు రోడ్డు కిరుప్రక్కలా వ్యాపార సంస్థల వాళ్లు ప్రభుత్వ స్థలాలను దురాక్రమించి కట్టుకొన్న అరుగులు బద్దలై పోయాయి. ట్రాఫిక్ సమస్యలు స్వయంగా ఆకళింపు చేసుకొని

తరువాయి 11వ పేజీలో

# లోక్‌అదాలత్‌లు బ్రహ్మాండం

ప్రజలందరికీ న్యాయం సమంగా అందించేందుకు లోక్ అదాలత్‌లు జిల్లాలో విజయవంతంగా నిర్వహిస్తున్నామని జిల్లా సెషన్స్ జడ్జి టి.ఆంజనేయులు చెప్పారు. 6వతేది జిల్లా జడ్జి ఛాంబర్‌లో జరిగిన విలేఖరుల సమావేశంలో మాట్లాడారు. ఈ యేడాది

## జిల్లా జడ్జి

జనవరి నుంచి అక్టోబర్ వరకు జిల్లా వ్యాప్తంగా 110 లోక్ అదాలత్‌లు నిర్వహించాం. ఈ సందర్భంగా 2705 కేసులు పరిష్కారానికి రాగా 1745 కేసులు పరిష్కరించాం. వీటిలో 1252 క్రిమినల్ కేసులున్నాయి. లోక్‌అదాలత్‌ల ద్వారా సుమారు కోటి 77లక్షల రూపాయల పరిహారం క్రింద కక్షిదారులకు ఇప్పించినట్లు చెప్పారు. వివాహ సంబంధమైన 330 కేసులు ఈ సందర్భంగా పరిష్కరించినట్లు వివరించారు. గత ఆరు మాసాల కాలంలో 15 న్యాయ శిక్షణా శిబిరాలు నిర్వహించామని, ఈ శిబిరాల పట్ల ప్రజల్ని అమోఘ్య స్పందన లభించిందన్నారు. ఈ శిబిరాలను అన్ని గ్రామాలకు విస్తృతపర్చే కృషి చేస్తామన్నారు. బడుగు వర్గాల వారికి, నిరక్షరాస్యులకు, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారికి న్యాయస్థానాల ద్వారా ఉచిత న్యాయ సహాయం అందిస్తున్నామన్నారు. లోక్ అదాలత్‌ల ద్వారా సమస్యలను పరిష్కరించుకొనేందుకు ప్రజలందరూ ముందుకు రావాలని జిల్లా జడ్జి ఆంజనేయులు విజ్ఞప్తి చేశారు.

# సభ్యత్వాలకోసం సందడే సందడి

తెలుగుదేశం పార్టీలో సభ్యత్వాన్ని తీసుకొను యువకులు, మహిళలు, వృద్ధులు ఎగబడుతున్నారని తెలుగుదేశం పట్టణ కన్వీనర్ అరిగెల కోదండ రామయ్య చెప్పారు. 8వతేది పార్టీ

## అరిగెల

కార్యాలయంలో ఏర్పాటు చేసిన విలేఖరుల సమావేశంలో మాట్లాడారు. సభ్యత్వ కార్యక్రమాన్ని ఈ రోజు ఉదయం లాంఛనంగా ప్రారంభించాం. ఏ ప్రాంతానికి వెళ్లినా పార్టీ సభ్యత్వాలు తీసుకొను యువకులు, మహిళలు ముందుకొస్తున్నారు. ఎవరికి వారు సభ్యత్వ రుసుం చెల్లిస్తున్నట్లు వివరించారు. డేగా నారసింహారెడ్డి, తాళ్లపాక అనూరాధ, రమేష్‌రెడ్డి, వై.వి.రామిరెడ్డి, శ్రీధరకృష్ణారెడ్డిలు సభ్యత్వం స్వీకరించినట్లు చెప్పారు. చంద్రబాబు నాయుడు చేసిన అభివృద్ధి పనుల వల్లే తెలుగుదేశం పార్టీలో చేరను ప్రజలు ముందుకు వస్తున్నారని కోదండరామయ్య రెట్టించిన ఉత్సాహంతో చెప్పారు.





నెల్లూరు యూతోనగర్‌లో సిమెంట్ రోడ్డు వేసే పనిని ప్రారంభిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, ప్రక్కన మాజీ ఎమ్మెల్యే రమేష్‌రెడ్డి, ఛేర్మన్ అనూరాధ, కౌన్సిలర్ లక్ష్మయ్య వైస్ ఛేర్మన్ నందాని బాషా వున్నారు.

# ఎస్పీ దెబ్బకు ఎక్సైజ్ గూబ గుయ్యిమంది!

నెల్లూరు టౌన్‌లోని బ్రాందీ షాపుల జోలికెళ్లొద్దని జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డిని పోలీసు ఉన్నతాధికారులు ఆదేశించినట్లు తెలిసింది. దీని మూలంగా కరకు తనం, నిజాయితీతో అనతికాలంలో సమర్థుడైన అధికారిగా పేరు తెచ్చుకున్న ఎస్పీ మెత్తబడడంతో బుధవారం టౌన్‌లోని బ్రాందీ షాపులకు అనుబంధంగా వున్న అనధికార్ల బార్ల ద్వారాలు మళ్లీ తెరచుకొన్నాయి. ఎస్పీగా శ్రీనివాసరెడ్డి బాధ్యతలు చేపట్టిన రోజే రామలింగాపురంలోని శ్రీవైన్స్‌లోని అనధికార బార్‌లో హత్య జరగడంతో ఆయన బ్రాందీ షాపులపై దృష్టి కేంద్రీకరించారు. బాధ్యతలు స్వీకరించిన కొన్ని గంటల్లోనే టౌన్‌లోని పోలీసు అధికారులందరినీ సమావేశపర్చి, ఇక్కడి అనధికార బార్లపై దాడులు చేయించారు. ఈ దెబ్బకు టౌన్‌లో బ్రాందీ వ్యాపారం బాగా దెబ్బతినింది. రోజూ రాత్రి 10.30గంటలకే బ్రాందీ షాపులను పోలీసులు దగ్గరుండి మూయించి వేస్తుండడంతో అత్యంత బలమైన మద్యం సిండికేట్ తట్టుకోలేక పోయింది. వారం రోజుల క్రితం సిండికేట్ నాయకులు ఎస్పీని కలసి ఈ విధంగా చేస్తే తాము నష్టపోతామని చెప్పారట. అయితే బ్రాందీ సిండికేట్ మాటలు ఏ మాత్రం వినని ఎస్పీ 'నష్టాలొస్తే షాపులు మూసుకోండి? మీ లాభాల కోసం టౌన్‌లోని శాంతిభద్రతల పరిస్థితిని క్షీణింప చేయాలా' అని గదమాయించినట్లు తెలిసింది.వీరు రకరకాలుగా ప్రలోభపెట్టినా ఎస్పీ లొంగక పోయేసరికి మరుసటి రోజే లిక్కర్ సిండికేట్ నాయకులు హైదరాబాద్‌కు ప్రయాణమయ్యారు. రాష్ట్ర ఎక్సైజ్ మంత్రి తుమ్మల నాగేశ్వరరావు, ఎక్సైజ్ కమీషనర్, ఎక్సైజ్ శాఖ డైరెక్టర్, మాజీ ఎస్పీ సి.వి.నరసయ్యలను కూడా కలసి నెల్లూరులో పరిస్థితిని విన్నవించారట. వెనువెంటనే ఎక్సైజ్ మంత్రి గుంటూరు రేంజ్ డిఐజి మాల కొండయ్యకు ఫోను చేసి ఈ విషయంలో ఎస్పీకి నచ్చచెప్పమన్నారట. ఉద్యోగుల

## మంత్రిస్థాయిలో జోక్యం
## అనధికార బార్లకు మోక్షం?

తరువాయి 11వ పేజీలో

# వక్ఫ్ పెద్దల నోళ్లకు లంచాల సీళ్లు

పెద్ద బజారులోని జామియా మసీదుకు చెందిన భూములు అమ్ముకొన్న వ్యక్తులు, పెద్ద మనుషులు అయిపోయారు. వక్ఫ్‌బోర్డు పెద్దలకు భారీ మొత్తంలో ముడుపులు అందజేయడంతో, ఈ భూమిని తిరిగి స్వాధీనం చేసుకోవడంలో వారు మీనమేషాలు లెక్కపెడుతున్నారు. అధమ పక్షం కోటి రూపాయలు విలువ చేసే మూడున్నర ఎకరాల ఈ భూమిని, 9 అంకణాల ప్లాట్లుగా విభజించి జెండావీధికి చెందిన ముస్లిం యువకుడు సయ్యద్ మొహియుద్దీన్ 70లక్షలకు అమ్మేశాడు. దీనికి జామియా మసీదు ముతవల్లీ రషీద్ అలీఖాన్ కూడా సహకరించి తన వాటా 4 లక్షల రూపాయలు తీసుకొన్నాడు. ఈ విషయమై పత్రికల్లో వార్తలు రాగానే మొహియుద్దీన్ తెలివైన ఎత్తుగడ వేసి మద్రాసు బస్టాండ్ వద్ద కోర్టు స్థలం ఆక్రమించి మసీదు కట్టినట్లే, దురాక్రమించిన స్థలంలోనూ మరో మసీదు కట్టి మతం రంగు పులమడానికి గట్టి ప్రయత్నం చేశాడు. కలెక్టర్ ప్రవీణ్ కుమార్ ఈ స్థలాన్ని, సందర్శించి, ఈ వ్యవహారాన్ని పూర్తిగా దర్యాప్తు చేయను విచారణాధికారిగా జాయింట్ కలెక్టర్ రావత్‌ను నియమించారు. కాని ఇంత వరకు ఈ స్థలంలో కాలుపెట్టే తీరిక ఆయనకు దొరకలేదు.

ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనే కార్యక్రమంలో భాగంగా మొహియుద్దీన్ బృందం రాష్ట్ర తెలుగుదేశం పార్టీ మైనార్టీ సెల్ విభాగం అధ్యక్షుడు, నెల్లూరీయుడు ఓడూరు గౌస్‌మొహిద్దీన్‌కు లక్షలు ఆశ చూపి తమ వైపు తిప్పుకొన్నారు. ఈ మహానుభావుడు రాష్ట్ర వక్ఫ్ బోర్డు సభ్యుడు కూడా అయినందున భూ బకాసురులకు నేరుగా రాష్ట్ర వక్ఫ్ బోర్డు అధ్యక్షుడు యూసఫ్ అలీ దగ్గరకు తీసుకెళ్లారట. ఆయనకూ 5 లక్షలు వాటా ఇస్తామని, బేరం కుదుర్చుకోవడంతో వక్ఫ్‌బోర్డులో ఈ స్థలం వ్యవహారంలోని రికార్డులు, జి.ఓ.లు తలక్రిందులు చేయను ప్రయత్నాలు మొదలు పెట్టినట్లు తెలిసింది.

ఈ వ్యవహారంలో తనకు వక్ఫ్ చట్టాలు తెలియవని జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మొదటి నుంచి చెబుతున్నారు. ఈ స్థలం వ్యవహారంలో వక్ఫ్ చట్టం ప్రస్తావనే అవసరం లేదు. కలెక్టర్ చేయవలసిందల్లా పోలీసులను పిలిపించి భూ బకాసులను అరెస్ట్ చేసి, జనం నుంచి దండిన సొమ్ము తిరిగి కక్కించడమే. ఈ వ్యవహారంలో ఆలస్యం చేస్తూ పోతే అక్కడ వెలుస్తున్న పక్కా భవనాల నిర్మాణాలకు కలెక్టర్, జాయింట్ కలెక్టర్ కూడా కారకులవుతారు.

## జామియా మసీదు
## భూముల కుంభకోణం

## ఆర్టీసిని ప్రైవేటీకరించడమా?

ఆర్టీసిని ప్రైవేటీకరించే తప్పుడు ఆలోచనను తెలుగుదేశం ప్రభుత్వం మానుకోవాలని వెంకటగిరి ఎమ్మెల్యే నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ సలహా యిచ్చారు. 8వతేది నెల్లూరు ఆర్టీసి

తరువాయి 11వ పేజీలో

# అయ్యోర్ల ఎంపికలో అన్నీ లోపాలే

టీచర్స్ రిక్రూట్‌మెంట్ టెస్ట్ - 2000 రాసిన నిరుద్యోగులు గ్రహపాటో, కంప్యూటర్ల మాయాజాలమో, అధికార్ల హస్తలాఘవమో కాని ప్రకటించిన ఫలితాలు చూస్తే పలు లోపాలు కనపడుతున్నాయి. నిరుద్యోగులు పరీక్షలు వ్రాసిన వంద సీరియల్ నెంబర్లు వుండే ఒక్కొక్క జాబితాలో ప్రత్యేకంగా ఎంపిక చేసినట్లు ఐదేసి మందే పాసయ్యారు. ఒక నెంబరు అయితే రెండుసార్లు ఫలితాల జాబితాలో చోటు చేసుకొంది. వివాదాస్పదంగా మారిన వికలాంగుల కోటాలోని 94

## నకిలీ వికలాంగుల సర్టిఫికేట్‌లపై దర్యాప్తు ఏమైంది?

పోస్టుల ఫలితాలను అధికారులు ప్రకటించారు. కాని నిరుద్యోగుల కన్నీళ్లు తుడవటానికి తూతూ మంత్రపు దర్యాప్తు చేస్తున్నారు. ఈ వ్యవహారంలోనూ వేలాది రూపాయలు చేతులు మారుతున్నాయన్న విమర్శలు వినవస్తున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లో అక్టోబర్ 31తేది ఫలితాలను ప్రకటిస్తే అన్నింటికన్నా చివర 4తేది నెల్లూరులో అధికారులు ఫలితాలు ప్రకటించారు.

సెకండరీ గ్రేడ్ పరీక్షలకు సంబంధించి హాల్ టిక్కెట్ నెంబర్లు 09000000 (9లక్షల) సీరియల్ నుంచి ప్రారంభమయ్యాయి. 9002501 నెంబరు వరకు కేవలం 126 మందే ఉత్తీర్ణులయ్యారు. అంటే నూటికి అయిదు మందే పాసయ్యారు. 9002601 సీరియల్ నుంచి 09002903 వరకు పరీక్ష వ్రాసిన 300 మందిలో 80 మంది పాసయ్యారు. 09003001 నుంచి 09003301 మధ్య మూడు వందల మందికిగాను 102 మంది, 0900330 నుంచి 09004100 నెంబర్ల మధ్య 202 మంది ఉత్తీర్ణులయ్యారు. ఫలితాలను బట్టి మొదటి 2500 మందిలో 126 మంది, అనంతరం 1500 మందిలో 304 మంది ఉత్తీర్ణులు కావడం విచిత్రంగా వుంది. ఈ పరీక్షలను ఒక్కొక్క గదిలో 50 మంది వ్రాశారు. ఫలితాలను బట్టి చూస్తే, కొన్ని సెంటర్లలో గదికి ఒక్కరు కూడా పాస్ కాకపోవడం కాస్త విడ్డూరంగానే తోస్తుంది. టౌన్‌లోని మూడు స్కూళ్లు సెంటర్లుగా వ్రాసిన విద్యార్థులు ఎక్కువగా పాస్ కావడం వెనుక ఏదైన మతలబు జరిగిందేమోననిపిస్తుంది. వందల మంది ఉన్నతాధికారులు ఒకటికి 20సార్లు పరిశీలించామన్న జాబితాలో 09003772 గల నెంబరు రెండుసార్లు చోటు చేసుకొంది. తర్వాత డిఇఓ ఈ నెంబరు 090033172 అని గుర్తించి ఆ నిరుద్యోగికి ఉద్యోగ మిచ్చానంటున్నారు. ఈ గందరగోళ మేమిటో ఆ దేవుడికే ఎరుక? వికలాంగుల కోటా క్రింద వున్న 94 పోస్టులకు గాను బోగస్ చెవిటి సర్టిఫికెట్స్ వదుల సంఖ్యలో నిరుద్యోగులు దాఖలు చేశారు. నెల్లూరు పెద్దాస్పత్రిలోని డాక్టర్ సుబ్రహ్మణ్యం డబ్బుకు కక్కుర్తిపడి ఒక్క జూలై నెలలోనే ఈ విధంగా 98 సర్టిఫికెట్లు ఇచ్చారని అక్టోబర్ 13తేది జమీన్‌రైతు సంచికలో వ్రాశాం. ఫలితాల ప్రకటనకు ముందే ఈ వ్యవహారంపై పరిశీలన జరపని అధికారులు, తీరిగ్గా ఫలితాలు ప్రకటించి, నామమాత్రపు దర్యాప్తు మొదలుపెట్టారు. దీనికిగాను 8తేది డిఇఓ ఆఫీసును వేదికగా తీసుకొని నెల్లూరులోని ఒక చెవి డాక్టర్‌ను పిలిపించి ఈ తంతుపూర్తి చేయను ప్రయత్నించారు. చెముడు పరిశీలనకు ముఖ్యమైన ఆడియో మీటర్ లేకుండానే ఈ డాక్టర్ ఏ విధంగా పరీక్షలు చేశారో అర్థం కావడం లేదు. ఈ వ్యవహారంలో మధ్యవర్తులు కొందరు దొంగ సర్టిఫికేట్లు దాఖలు చేసిన వారి వద్ద నుండి భారీ మొత్తంలో డబ్బులు వసూలు చేసి మేనేజ్ చేసినట్లు తెలిసింది. చెముడు లేకున్నా ఆత్మకూరు ప్రాంతానికి చెందిన 12 మందికి బోగస్ సర్టిఫికెట్లతో టీచర్ పోస్టులు వచ్చాయి.

తెలుగుదేశం ప్రభుత్వం అన్ని వ్యవహారాలు పారదర్శకమైనవే అని

కొరవ 8వ పేజీలో

# ఆత్మకూరులో అవస్థల కరెంట్

ఆత్మకూరు 'రీకో' పరిధిలోని గ్రామాల్లో గతవారం రోజులుగా రోజుకు 5 గంటలు విద్యుత్ కోతను విధిస్తున్నారు. ఈ కోతను వేళాపాళ లేకుండా విధిస్తుండడం వల్ల ప్రజలు ఇబ్బందులు పడుతున్నారు. వానాకాలంలోనే ఐదు గంటల కోత విధిస్తున్న ప్రభుత్వాన్ని రకరకాలుగా నిందిస్తున్నారు. ఈ విషయమై విద్యుత్ శాఖాధికారులను వివరణ అడిగితే, కోతను తాము అమలు చేయడం లేదని కడప మెయిన్‌లైన్‌లోనే విద్యుత్ సరఫరాకు అంతరాయం కల్గుతుందని సమాధానం చెబుతున్నారు.

## ఆసుపత్రి నిధులు కాజేసేందుకు పోటీ

ఆత్మకూరులోని ప్రభుత్వ ఆసుపత్రిని అభివృద్ధి చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిన మొత్తాన్ని కాజేసేందుకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల నాయకులు పోటీలు పడుతున్నారు. రెండేళ్ల క్రితం ఆసుపత్రి అభివృద్ధికి లక్షా 80వేల గ్రాంటు వచ్చింది. అప్పుడు డాక్టర్‌గా వుండిన ఎన్.పురుషోత్తం వీటిని ఖర్చు చేయకుండానే విశాఖపట్నం బదలీ అయిపోయారు. ఇటీవల కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల వారి చూపు ఈ నిధులపై మళ్లింది. కాంగ్రెస్ పార్టీకి చెందిన కొందరు నాయకులు ఆసుపత్రికి సున్నం కొట్టించి, 4 ఫ్యాన్లు, 5 ట్యూబులైట్లు వేయించారు. ఆ తర్వాత పంచాయతీ రాజ్ ఎ.ఇ. దగ్గరకు వెళ్లి ఈ పనులు చేయించినందుకు 75వేల రూపాయలు ఖర్చయినట్లు ఎస్టిమేషన్ వేయించారు. తామేమి తక్కువ కాదన్నట్లు తెలుగుదేశం పార్టీ వారు పోస్టు మార్టం గది చుట్టూ బురద మట్టితో ప్రహరీ గోడ కట్టి 52వేల ఎస్టిమేషన్ వేయించి ఈ బిల్లులను డాక్టర్ ఆదినారాయరెడ్డి ముందుంచారు. ఈ పనులు ఎవరు చేయించమన్నారని డాక్టర్ అడిగితే నిధులు మురిగిపోకుండా ఈ పనులు చేశామని వాటిని మంజూరు

## జిల్లావార్తలు

చేయమని డాక్టర్ ప్రాణం తీస్తున్నారు. అత్యవసర పరిస్థితుల్లో ఆసుపత్రిలో చేరే రోగులకు మందులకు తప్ప ఈ నిధిని పొరపాటున ఖర్చు చేయనని డాక్టర్ చెబుతున్నారు. మరి ఈ నిధుల వివాదాన్ని ఇరు పార్టీల నాయకులు ఎంత వరకు తీసుకవెళ్తారనేది వేచి చూడాల్సిందే.

## నష్టాల్లో వెంకటగిరి టెలికాం సెంటర్

వెంకటగిరిలోని టెలికాం సెంటర్ నష్టాల్లో నడుస్తుంది. 1992లో ఇక్కడ

కొరవ 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## చెత్తలోనూ నిధులుమేస్తున్నారు

నెల్లూరు మున్సిపాలిటీలో కొంత మంది కౌన్సిలర్లు అడ్డదారుల్లో డబ్బు సంపాదనకు అవురావురు మంటున్నారు. పందు దొరికితే కక్కుసుదొడ్లలో, తిని పారేసిన ఎంగిలి విస్తర్ల చెత్తలో కూడా చిల్లర ఏరుకొనేందుకు ఎగబడుతున్నారు. ఒకవైపు మున్సిపాలిటీ అప్పుల్లో కూరుకు పోయిందని గగ్గోలు పెడుతూనే, మరోవైపు ఛైర్‌పర్సన్ తనను ఆశ్రయించే కౌన్సిలర్లకు చెత్తతొలగింపు పేరుతో దోచిపెడుతోంది. తన రాజకీయ అవసరాల కోసం ప్రజా సంక్షేమాన్ని పణంగా పెడుతోంది. 35వార్డులో చెత్త తొలగింపు పేరుతో 29వేల రూపాయల బిల్లు చెల్లిస్తుండగా వైస్ ఛేర్మన్ సందానిబాషా తోసహా, కొందరు కౌన్సిలర్లు అడ్డుకున్నారు. గత నెలలో కూడా ఈ వార్డులో చెత్త తొలగింపు పేరుతో 50వేల రూపాయలు బిల్లు చెల్లించారని వారన్నారు. ఆ వార్డులో చెత్త తొలగింపునకు ట్రాక్టర్ రాలేదని, దొంగ బిల్లులు సృష్టించి, బినామీ పేర్లతో కౌన్సిలరే నిధులు స్వాహా చేస్తోందని ధ్వజమెత్తారు. దీంతో కమీషనర్ బిల్లు చెల్లింపులను నిలిపివేసి ఈ వ్యవహారంపై విచారణకు ఆదేశాలు జారీ చేశారు.

## వివేకా వీరంగం

నెల్లూరు రైల్వే స్టేషన్‌లో ఫుట్ ఓవర్ బ్రిడ్జి, తూర్పువైపు కొత్త టిక్కెట్ కౌంటర్‌లకు, ఎమ్పీ రాజేశ్వరమ్మ గురువారం ప్రారంభోత్సవం చేశారు. అతి ముఖ్యమైన ఈ కార్యక్రమం కూడా ఇరవై ముప్పై మందితో దిగేదుస్తూ జరిగింది. ఈ సందర్భంగా రైల్వే స్టేషన్‌లో తెలుగు దేశం పార్టీ జెండాలు కట్టడంపై, ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఇక్కడ ఎగిరి అక్కడ పడ్డాడు. ప్రభుత్వ కార్యక్రమాలకు పసుపు రంగు పులమడం ఏమిటని, రైల్వే డివిజనల్ మేనేజర్‌ను ఆంగ్లాంధ్ర భాషలో దులపరించేశాడు. నెల్లూరు ప్రజలు చిర కాలంగా ఎదురు చూసిన ఇంత ముఖ్య మైన కార్యక్రమాన్ని గుట్టుచప్పుడు కాకుం డా చేయడంపై కూడా నిరసన వ్యక్తం చేశారు.

## పోలీసు అదుపులో గ్రీన్‌గ్లోరి బ్రదర్స్

ఇటు ప్రజలను, అటు పోలీసులకు కుచ్చుటోపీ పెట్టి లక్షలాది రూపాయలతో పరారైన గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ రవిచంద్ర, యువరాజ్‌లను పోలీసులు అదుపులోకి తీసుకొన్నారు. ఏడాది క్రిందట నెల్లూరు వచ్చిన గ్లీన్‌గ్లోరి బ్రదర్స్ మాజీ ఎస్పీ సి.వి.నరసయ్య సహకారంతో చైన్‌లింక్ స్కీమ్ పేరుతో లక్షలాది రూపాయలు ప్రజల డబ్బు దోచేశారు. వెబ్‌సైట్ పేరుతో కూడా లక్షల రూపాయలు నెల్లూరీయుల దగ్గర దోచుకొని నరసయ్య ట్రాన్స్‌ఫర్‌తో పాటు పరారయ్యారు. వీరిని పట్టుకోవడానికి పోలీసులు పెద్దగా ప్రయత్నించలేదు. పోలీసు అధికారులతో దగ్గర సంబంధాలు వుండడమే దీనికి కారణమవాలి. మొత్తానికి గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ ఖర్మకాలి చిత్తూరు జిల్లాలో ఒక పోలీసు అధికారి కుమార్తెను మోసగించి కిడ్నాప్ చేయను ప్రయత్నించి తిరుపతి పోలీసులకు దొరికిపోయారు. ఈ సమాచారం అందుకొన్న నెల్లూరు పోలీసులు తిరుపతికెళ్ళి వీరిని అదుపు లోనికి తీసుకొన్నారు. ఎస్పీ శ్రీనివాసరెడ్డి ఈ వ్యవహారంలో కరకుగానే వ్యవహరిస్తున్నారు. గ్రీన్‌గ్లోరి బ్రదర్స్ తిన్న ప్రజల డబ్బు కక్కిస్తే ఎక్కువ శాతం పోలీసులే ఎస్పీగారికి రుణపడి వుంటారు.

కొరవ 7వ పేజీలో

## నెల్లూరు నగరానికి నయాగరా

# డి.ఆర్. ఉత్తమ

నెల్లూరు కూడా ఒక నగరం అనడానికి అర్హత కల్పించాడు ధనుంజయరెడ్డి. నెల్లూరు నగరం అని పత్రికలలో తరచు వ్రాస్తూ వుంటాము; మాట్లాడుతున్నాము. కాని నగరానికి కావల్సిన హంగులు ఏవీ మన పట్టణం లో లేవు. మంచి హోటళ్లు, విశాలమైన పార్కులు, ఆకర్షణీయమైన అంగళ్లు, చూడదగిన ప్రదేశాలు, విశాలమైన రోడ్లు వంటివి నగర లక్షణాలు. వీటిలో ఏ ఒక్కటి నెల్లూరులో లేవు. ఈ మధ్యనే జె.ఎస్.రెడ్డి గారి పుణ్యాన మంచి పార్కు ఏర్పడింది. ఇప్పుడు ధనుంజయ రెడ్డి పెద్ద హోటల్ కట్టాడు.

డిఆర్ డేస్ ఇన్ హోటల్‌లోకి తొంగి చూస్తే - మనం నెల్లూరులో వున్నామా లేక పొరపాటున మద్రాసు టి.నగర్‌కు వెళ్లి పోయామా అన్న సందేహం కల్గడం సహజం. నెల్లూరు వంటి చిన్న పట్టణాల్లో వుండదగిన హోటల్ కాదు అది. గేట్‌లోకి అడుగు పెట్టినప్పటి నుంచి తళ తళ మెరిసే గ్రానైట్ రాళ్లు, విశాలమైన లాన్లు, 5 స్టార్ హోటళ్లను తలపింపచేసే రిసెప్షన్ అమరిక, బోరా అని నోరు వెళ్లబెట్టి చూడవల్సిన అలంకారణలు. గదిలోకి వెళ్లి చూస్తే హంస తూలికా తల్పాలను తలపింప చేసే పడకలు, బాత్‌రూంలో నీటి తొట్లు; రూఫ్ టాప్‌లో స్విమ్మింగ్ పూల్, హోటల్ లోపలే హెయిర్ డ్రస్సింగ్, ఆవిరి స్నానం గదులు, అత్యాధునిక జిమ్, కళ్లు ఆర్పకుండా చూడవల్సిన అద్దాల లిఫ్టులు, సుమారైన పెళ్లి జరుపుకో దగిన కాన్ఫరెన్స్ హాళ్లు, బార్ రూమ్లు, రెస్టారెంట్లు... అది, ఇది అని చెప్పుకోవాల్సిన పని లేదు. స్టార్ హోటళ్లలో ఏ ఏ వస్తువులు వుంటాయో వాటన్నింటిని అట్నే తెచ్చి దించేశాడు ధనుంజయరెడ్డి.

ఈ విలేఖరికి ఒక సందేహం కల్గింది - ఈ హోటల్ స్థాయికి సరి తూగగల్గిన అతిథులు నెల్లూరులో వున్నారా అని. కేవలం డబ్బు సంపాదించాలనే వుద్దేశ్యం అయితే ధనుంజయరెడ్డి ఈ హోటల్, ఇక్కడ కట్టవల్సిన పని లేదు. ఏ మద్రాసులోనో లేక హైదరాబాద్‌లోనో ఇదే ఖర్చుతో దీన్ని నిర్మించి వుండవచ్చు. అప్పుడది లాభసాటి వ్యాపారం అయి వుండేది. తన వూహలకు తగినంతగా నెల్లూరు నగరం ఎదగలేదని తెల్సినప్పటికి, మిత్రులు, బంధువులు వద్దు అని వారించినప్పటికి పట్టుబట్టి నెల్లూరులో ఇంత పెద్ద హోటల్ కట్టాడాయన. అందుకు కారణం డబ్బు సంపాదించాలనే యావ కాదు. తన సంపదతో తాను పుట్టిన వూరిలో ఏదో ఒక పెద్ద పని చేసి చూపించాలనే ఉత్సాహం మాత్రమే. అందువల్లనే కోట్ల రూపాయల సొమ్ము మంచినీళ్ల మాదిరి ఖర్చు పెట్టాడు; తిరిగి వస్తుందా, రాదా అన్న మీమాంస వదిలేసి ఉదారంగా వ్యవహరించాడు.

ధనుంజయరెడ్డిలోని నెల్లూరు ప్రేమ, పుట్టిన వూరిపై అభిమానం అభినందనీయం. ఆయన హోటల్ మూడు గదులు, ఆరుగురు అతిథులుగా కళకళలాడాలని కోరుకుంటున్నాము. ఆయనకు మా శుభాకాంక్షలు.

## కరణం బలరాం

* మొదటి పేజీ కొరవ

ఒక బురద గుంటలో ఆ యువకుడ్ని విసిరేసి వెళ్ళిపోయారు. అతడు చచ్చాడో, బ్రతికాడో కూడా చూడలేదు. మానవత్వం వున్న వారెవరూ ఇంత క్రూరంగా ప్రవర్తించలేరు.

అదృష్టం బాగుండి, దారిన పోయే కొందరు విద్యార్థులు ఈ దృశ్యం చూసి, వెంటనే సోహన్‌పాల్‌ను ఆస్పత్రికి తరలించారు. అతడిప్పుడు కోమాలో వున్నాడు. ఇట్లా బురద గుంటపాలు చేయకుండా నేరుగా ఆస్పత్రికి వెళ్లి సకాలంలో వైద్య సహాయం అందించి వుంటే పాపమా యువకుడు బ్రతికి వుండేవాడు.

మామూలు పరిస్థితుల్లో అయితే కారు ఎవరిదో, కారు క్రింద పడిన వాడు ఎవరో తెల్సే అవకాశం లేదు. కాని కరణం బలరాం అదృష్టం గతి తప్పి, మంజూసచ్‌దేవ అనే యువతి ప్రమాదం జరిగినప్పుడు అక్కడ వుండడం తటస్థించింది. ఆమె ఢిల్లీలో ప్రజా సేవ చేసే స్వాభిమాన్ అనే సంఘానికి అధ్యక్షురాలట. అందరి వలె చూసి వెళ్లిపోకుండా ఆ యువతి ప్రమాదం జరిగిన చోటుకు వెళ్లి, మోటార్ సైకిల్ బాగ్ లోపల వుండిన సోహన్‌పాల్ చిరునామా కార్డు వెలికి తీసి, అతడి తల్లితండ్రులకు సమాచారం అందించింది. అంతకంటే ముఖ్యంగా, ప్రమాదం జరిగినప్పుడు బలరాం కారు నుంచి క్రిందపడిన ఎమ్మెల్యే కారు పాస్ కాగితం కూడా సేకరించింది. దానితో బలరాం చేసిన ఘాతుకం బయట పడిపోయింది.

కేవలం కారు ప్రమాదం అయితే ఇంతగా చర్చించుకోవల్సిన అవసరం లేదు. ప్రమాదాలకు డ్రైవర్ నిర్లక్ష్యం కారణం అవుతుంది తప్ప బలరాం తప్పు వుండదు. కాని ఆ తర్వాత జరిగిన సంఘటనలే హృదయవేదన కల్గిస్తున్నాయి. ప్రమాదం జరిగిన వెంటనే ఆ యువకుడ్ని ఆస్పత్రిలో చేర్పించి, చికిత్స చేయించాల్సిన వ్యక్తులు, నెత్తుటి మడుగులో పడి వుండిన యువకుడ్ని దూరంగా తీసుక వెళ్లి బురద గుంటలో పడేయడం ఎంత క్రూరమైన విషయం? మామూలు వ్యక్తులు ఈ నేరానికి పాల్పడి వుంటే ప్రతి ఒక్కరూ ఖండించి తీరుతారు. అటువంటిది ఒక పార్లమెంటు సభ్యుడు అంత దానవత్వంతో వ్యవహరిస్తే - ఏమి చేయాలి? అంతే కాదు, కారులోని వ్యక్తులు క్రిందపడిన సోహన్‌పాల్ జేబులోని ఐడెంటిటి కార్డును బయటకు లాగి, చించి పారేశారట. మోటార్ సైకిల్ 'సి' బుక్‌ను సైతం వారే తీసుకువెళ్లారట. ఈ చర్యల వుద్దేశ్యం, ప్రమాదంలో చనిపోయింది ఎవరు అనే విషయం పోలీసుకు అంత తొందరగా తెలియకుండా చూడడం మాత్రమే. ప్రొఫెషనల్ నేరస్తులయితే తప్ప ఇంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించలేరన్నది వాస్తవం. సాధారణ వ్యక్తులు ఎవరైనా ఇటువంటి ప్రమాదానికి తాము కారణం అని తెలియంగానే కాళ్లు చేతులు ఆడవు; మనసు మొద్దుబారి పోతుంది. రక్తంతో, మనుషుల ప్రాణాలతో ఆటలాడుకునే రాక్షసులు మాత్రమే ఇట్లా ప్రవర్తించగల్గుతారు.

ఈ ప్రమాదానికి కారణమైన కారులో, ఆ సమయంలో కరణం బలరాం గారు వున్నారా లేక ఆ కారును వేరెవరైనా వాడుతున్నారా అన్న విషయం ఇంకా ధృవపడలేదు. కారు బలరామ్‌ది అన్నది మాత్రమే ధృవపడింది. ఢిల్లీ పోలీసులు బలరాం కోసం వెతుకుతున్నారు. లోక్‌సభ స్పీకర్ బాలయోగిని కూడా ఈ విషయంలో సంప్రదించారని తెల్సింది. ఒక పోలీసు అధికారుల బృందం హైదరాబాద్‌కు వచ్చి ముఖ్యమంత్రిని కలవబోతున్నది.

ఈ సంఘటన వింటుంటే హృదయం ద్రవించి పోతున్నది; వొళ్లు జలదరిస్తున్నది. చావు బ్రతుకులలో వున్న వ్యక్తి పట్ల అంత క్రూరంగా ప్రవర్తించిన వారిని వదిలేయడం క్షమార్హంకాదు. ఆ సమయంలో కారులో వున్నది ఎవరో విచారించి, అందుకు బాధ్యులైన వారిని హత్యానేరం క్రింద విచారణ జరపడం న్యాయం.

కేవలం కారు ప్రమాదం అయితే పరిస్థితి వేరు. ప్రమాదాలు మన చేతులలో వుండవు. కాని నెత్తుటి మడుగులో వున్న వ్యక్తిని ఎంత మాత్రం దయ లేకుండా బురద గుంటలో విసిరి వేయడం, ఆచూకి దొరకకుండా చేయడానికి చూడడం నాగరిక సమాజం సిగ్గుతో తలదించుకోవాల్సిన విషయం. బలరాంఅధికార పార్టీ నేత, అందులోను పార్లమెంట్ సభ్యుడు అని కేసును నీరుగార్చకుండా, కఠినంగా శిక్ష విధిస్తే తప్ప - మనుషుల పట్ల ప్రదర్శించాల్సిన కనీస మానవత్వ వైఖరి అలవడదు. *

## ఉల్ఫెన్‌సన్

మొదటి పేజీ కొరవ

వస్తే ఉదారంగా వ్యవహరించే పరిస్థితి సైతం లేదు. రాష్ట్ర ప్రభుత్వం దగ్గర డబ్బు లేకుంటే కేంద్ర ప్రభుత్వ నిధులలో నుంచి నేరుగా దండుక పోతుంది ప్రపంచ బ్యాంక్. వారు చేసేది కేవలం వ్యాపారం - అది కూడా అసలు సిసలు వడ్డీ వ్యాపారం. మన సమాజంలో వడ్డీ వ్యాపారులంటే చులకన అభిప్రాయం వుంది. అటువంటిది ఒక్క వడ్డీ వ్యాపారుడి కోసం ముఖ్యమంత్రి సాంప్రదాయాలు వదలిపెట్టి అతిగా సాష్టాంగ పడడం పట్లనే ప్రతిపక్షాలు, ప్రజా సంఘాలు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నాయి.

ఇంతగా విమర్శలు ఎదుర్కొంటు కూడా చంద్రబాబు నాయుడు ఈ పర్యటనల పట్ల ఇంత ఆసక్తి చూపడానికి కారణం ఏమిటి? నిజానికి ఇందులో చంద్రబాబు నాయుడు స్వంత ప్రయోజనం ఏదీ లేదు. ప్రపంచ బ్యాంకు అప్పు ఇస్తే రాష్ట్రానికి మాత్రమే ఇస్తుంది. స్వంతానికి ఇవ్వదు. అందువల్ల ఇందులో ఆయన స్వార్థం వెతకడం అన్యాయం. అయితే రాష్ట్రం కోసం కూడా రాష్ట్ర ప్రజల ఆత్మగౌరవం బలి పెట్టవల్సిన అవసరం ఏమి వుంది అన్నది ప్రశ్న.

ప్రపంచ బ్యాంక్ అప్పు ఇప్పుడు రాష్ట్ర ప్రజల కోసం కంటే ముఖ్యమంత్రి రాజకీయ ప్రయోజనాలకు చాలా అవసరం. రాష్ట్ర ఖజానాలో చిల్లి గవ్వ డబ్బు లేదు. ప్రభుత్వం తరపున ఒక్క అభివృద్ధి కార్యక్రమం చేపట్టే పరిస్థితిలో లేదు ప్రభుత్వం. పన్నుల ద్వారా వచ్చే డబ్బు ఉద్యోగుల జీతాలకు చాలడం లేదు. ప్రపంచ బ్యాంక్ వంటి సంస్థలు అప్పులు ఇస్తే తప్ప తనది పనిచేసే ప్రభుత్వం అని చెప్పుకునే అవకాశం కల్గదు ముఖ్యమంత్రికి. అందువల్లే ఆయన అంతగా తాపత్రయ పడుతున్నాడు. *

## గుర్రు

మొదటి పేజీ కొరవ

భయం ఎమ్మెల్యేలలో వుంది. అందువల్ల ఇప్పటికి ఇప్పుడు మంత్రిత్వాలు రాని వారి నుంచి ముఖ్యమంత్రికి ఎదురయ్యే ఇబ్బంది ఏదీ లేదు.

పార్టీలో చంద్రబాబు పట్ల అసంతృప్తి కల్గిన వారంతా పంచాయతీ ఎన్నికలకోసం చకోర పక్షుల వలె ఎదురు చూస్తున్నారు. విద్యుత్ ధరల పెంపకం వంటి సమస్యల వల్ల ప్రజలలో చేలరేగుతున్న ప్రభుత్వ వ్యతిరేక భావాలు బయట పడడానికి పంచాయతీ ఎన్నికలు ఒక్కటే మార్గం. ఆ ఎన్నికలలో తెలుగు దేశం చాలా దారుణమైన ఓటమి చవిచూస్తుందన్నది రాజకీయ పరిశీలకుల అభిప్రాయం. ముఖ్యమంత్రికి కూడా ఈ సంగతి తెలుసు. అందువల్లే ఆయన వాటిని ఎంత వీలైతే అంత వెనకకు నెట్టడానికి చూస్తున్నాడు. సుప్రీంకోర్టు స్టే ఆయనకు ఆ వెసలుబాటు కల్పించింది. అయితే కోర్టు ద్వారా ఈ సమస్యను శాశ్వతంగా నాన బెట్టడం సాధ్యం కాదు కదా? ఎప్పుడో ఒకప్పుడు ఎన్నికలు జరపక తప్పదు, ఆ శుభ ముహూర్తం వస్తే తమ ప్రతాపం ప్రదర్శించాలని ఎదురు చూస్తున్నారు ఎమ్మెల్యేలు. *

## సణుగుడు

2వ పేజీ కొరవ

ఇన్ని సౌకర్యాలు ఒకేచోట కల్గిన ప్రదేశం ఏదీ లేదు. ప్రారంభోత్సవం రోజు దాన్ని చూసిన నెల్లూరీయులకు కళ్లు తిరిగి పోయాయి.

అంత గొప్పగా తయారైన ప్రజా ప్రయోజన కేంద్రం అధికారుల నిర్లక్ష్యం వల్ల పాడు పడి పోవడం అన్యాయం. రిబ్బను కత్తిరింపు కూడా జరిగిపోయిన తర్వాత తలుపులు మూసిపెట్ట వల్సిన అగత్యం ఎందుకో ఇప్పటి కలెక్టర్ గారికే తెలియాలి. పార్కు నిర్మాణంలో అవకతవకలు జరిగాయన్న అపోహలు, దాని యాజమాన్యం ఎవరికి అప్ప చెప్పాలన్న సందిగ్ధంతో శాశ్వతంగా తలుపులు బంధించేశాడు కలెక్టరు గారు. ఆయన ప్రవర్తన సరికాదు. నిర్మాణంలో అవకతవకలు జరిగాయని సందేహం కల్గితే, విచారణ జరపాలి తప్ప ఏకంగా పార్కు మూసిపారేయడం ఏమిటి? మంచి వుద్దేశ్యంతో, మంచి మనసుతో నిర్మితమైన మంచి సంస్థ ఇది; దాన్ని ఇట్లా తమ అధికారం ప్రదర్శించడానికి వేదికగా వాడుకోవడం తప్పు. కలెక్టర్ గారు తక్షణం పార్కు తలుపులు తెరిపించాలి. ఇక ఏ మాత్రం ఆలస్యం జరిగినా ప్రజలు క్షమించరు. *

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

హింసిస్తుంటే సహనం కోల్పోయి వారి మీదికి తిరగబడి వారి దుమ్ముదులిపేస్తాడు. అమాయకంగా అతను చేసే ఫైటింగులు భయంతో ఎలుకను చూచి తల్లిబిడ్డలయ్యే దృశ్యాలు చూచి తీరవలసిందే. ఈ పాత్ర మట్టూ అల్లిన హాస్య సన్నివేశాల్లో కమలహాసన్ మంచి వినోదాన్ని పండించాడు.

కథలోకి వస్తే తెనాలి కన్నతండ్రి మతిస్థిమితం తప్పిపోతాడు, మహాభయస్తుడు. మహా పిరికివాడు. మానసిక బలహీనతగల తెనాలికి వైద్యం చేసే డాక్టర్ పంచభూతం (ఢిల్లీగణేష్), డాక్టర్ కైలాష్ (జయరాం) అనే సైకియాట్రిస్ట్‌ల మధ్య సాగుతుంది కథ. వృత్తిరీత్యా ఈ డాక్టర్ల మధ్య విరోధం ఏర్పడుతుంది. కైలాష్‌ను దెబ్బ తీసేందుకు పంచభూతం తెనాలిని అతని వద్దకు పేషంటుగా పంపుతాడు. తెనాలి తన పిచ్చి చేష్టలతో కైలాష్‌ను ఏడిపించుక తింటాడు. తెనాలి దెబ్బకు తట్టుకోలేక కైలాష్ కొడైకెనాల్‌కు పారిపోతాడు. తెనాలిని తీసుకొని పంచభూతం కూడా కొడైకెనాల్ పారిపోతాడు. అక్కడ తెనాలిని మరలా కైలాష్ మీదికి ప్రయోగిస్తాడు. ఇలా వింతవింతగా వినోదంగా సాగిపోతుంది చిత్రం. అందరూ చూచి ఆనందించ తగిందిగా రూపొందింది.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

### గూడూరు డాక్టర్ మరణం

గూడూరులో పేదల డాక్టర్‌గా పేరొందిన తన్నమాల శ్రీనివాసులురెడ్డి (51) 31తేది ఆకస్మికంగా మరణించారు. వీరి కుటుంబానికి మా సానుభూతి.

## సంస్మృతి



తెలుగు సినీ ప్రపంచాన్ని తన హాస్య నటనతో ఉర్రూతలూగించిన

### టి.వి. రమణారెడ్డి గారు

(మరణం 11.11.1974)

స్వర్గస్థులై 11.11.2000 తేదికి 26 సంవత్సరాలు నిండుతాయి.

వారిని సంస్మరించుకుంటూ...

... కుటుంబసభ్యులు

# వాస్తులో 'వర్గు' ఛాందసం

ప్రాచీన న్యాయశాస్త్ర ధర్మాల్నీ, రాజ్యాంగంలోని సూత్రాల్నీ కాలాను గుణంగా మార్చవలసిన అవసరం వున్నట్లే వాస్తులో అనుసరణీయం కాని వాటిని మార్చితీరాలి! లేదా వాటిని శాస్త్రం నుంచి తొలగించివేయాలి.

వాస్తులో 'వర్గు' చెపుతున్నదేమిటో అది సాధ్యమా? అసాధ్యమా? ఈ 'వర్గు'లలో సారాంశమేమిటంటే వ్యక్తిలేక స్థలం యజమాని పేరులోని మొదటి అక్షరం ప్రకారం అతని వర్గు నిర్ణయించ బడుతుంది. ఆ తర్వాత మూల సూత్రాల్నీ బట్టి ధనం, రుణం ఏవి ఎక్కువో గణిస్తారు. అలా వచ్చిన లెక్కల్లో ధనం కంటే రుణం ఎక్కువైతే ఆ దిక్కులో అతను గృహం నిర్మించకూడదన్నమాట. అలాగే అతని వర్గం అధిపతి బలహీనుడై స్థల వర్గు అధిపతి బలవంతుడైతే అతను అక్కడ ఇల్లు కట్టకూడదన్నమాట. ఆ విషయం ఇప్పుడు పరిశీలిద్దాం.

### వర్గు విభాగం!

వర్గును ఎట్లా నిర్ణయిస్తారో చూద్దాం. తెలుగులో క, ఖ, గ, ఘ అను అక్షర సముదాయాన్ని 'క వర్గం'

**వాస్తుసంగతులు**
**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**

అంటారు. అలాగే చ, ఛ, జ, ఝ, ఞ 'చ వర్గం'. ఈ విధంగా ఎనిమిది వర్గులున్నాయి. వర్గారూఢాన్ని గూర్చి ప్రాచీన శాస్త్రాల్లో ఎట్లా చెప్పారో చూద్దాం.

సీ. 'అకచటతపయశ అష్ట
వర్గంబులు
ప్రాగాది దిశలను బరగునందు
గరుడుండు మార్జాలకంఠీరవుండు
సర్పమూషిక గజశశములుండు
అధిపు వర్గంబున
కమరంగపంచమ
వర్గంబు శేషంబు, వర్గశుభంబు
అధిక వర్గంబు దానల్ప వర్గము
మీద
నుండిన అధికర్తకు చితమగును
అధికవర్గ స్థలంబున నల్పవర్గు
లున్నాకో పాపినందు
దుర్వ్యయందు
శత్రు మిత్రధ్వయంబుల
బాధనొరిగి
ఇంద్లుగట్టిన భావుకంబెనగుకృష్ణ

దీని తాత్పర్యం ఏమిటంటే 'అ' వర్గానికి తూర్పుదిశ నిర్ణయించబడింది. అధిపతి గరుత్మంతుడు. అట్నే 'క' వర్గానికి ఆగ్నేయం అధిపతి మార్జాలం. 'చ' వర్గానికి దక్షిణం, అధిపతి సింహం. 'ట' వర్గానికి నైరుతి, అధిపతి శునకం. 'త' వర్గానికి పశ్చిమం, అధిపతి సర్పం. 'ప' వర్గానికి వాయువ్యం, అధిపతి ఎలుక. 'య' వర్గానికి ఈశాన్యం, అధిపతి శశము. ఇలా నిర్ణయించిన తర్వాత ప్రతిదానికి పై వర్గం శత్రువర్గమన్నారు. అదిగాక బలహీనమైన నామాధ్యక్షరం గలవారు బలమైన స్థలంలో ఇల్లు కట్టగూడదన్నారు.

ఉదాహరణకు నాగేశ్వరరావు అనే వ్యక్తి పశ్చిమంలో 'వర్గు' ప్రకారం ఇల్లు నిర్మించుకోవాలి. అతనికి తూర్పు దిక్కు రోడ్డు వున్న స్థలం వుంది. తూర్పు 'అ వర్గం' అవుతుంది. అధిపతి గరుత్మంతుడు. అంటే సర్పానికంటే బలవంతుడన్నమాట గరుత్మంతుడు. అంచేత అతను తూర్పు రోడ్డున్న స్థలంలో ఇల్లు కట్టకూడదన్న మాట. అంచేత పశ్చిమంలోనే ఇల్లు కట్టుకోవాలి. అనగా అతను పశ్చిమ స్థలాన్నికొని గృహం నిర్మించుకోవాలి. అలా కట్టుకున్నా ఆ తర్వాత అతని కుమారుడు రామ్మూర్తి అనుకుందాం. అతనిది య వర్గు. అంటే ఉత్తరంలో ఇల్లు కట్టుకోవాలన్న మాట. అధిపతి గజం గనుక - పశ్చిమం అధిపతి సర్పం. గజానికి, సర్పానికి విరోధం గనుక అతను పశ్చిమం ఇంటిని ఖాళీ చేసి ఉత్తరం స్థలం కొని ఇల్లు కట్టుకోవాలి. ఇదీ వ్యవహారం. ఈ కలియుగంలో ఇది సాధ్యమయ్యే పనేనా?

### మరొక గండం!

ఉదాహరణకు కృష్ణమూర్తి అనే వ్యక్తికి పశ్చిమం రోడ్డు స్థలం వుంది. అతను అందులో ఇల్లు కట్టుకోవాలనుకున్నాడు. వీలు పడుతుందో లేదో చూద్దాం. కృష్ణమూర్తి నామాధ్యక్షరం, 'క' వర్గం. అంటే మార్జాలం అధిపతి. ఆగ్నేయం ఇతనికి ప్రశస్తం. అయితే అతను పశ్చిమంలో ఇల్లు కట్టుకోవాలి అనుకున్నాడు. పశ్చిమం అధిపతి 'సర్పం'.

క వర్గం స్థానం: 2
పశ్చిమ వర్గం స్థానం : 5

ఇప్పుడు ధనం రుణం ఎలా వుందో చూడాలి.

రెండు స్థానాలు కలిపితే: 25
వర్గులు 8, అంచేత : 25

అంటే ఎనిమిది మూళ్ల ఇరవై నాలుగు, ఒకటి శేషం మిగిలింది. ఈ విధంగా ధనం ఒకటన్నమాట. అలాగే రుణం ఎంత వుందో చూద్దాం. "అంకనాం వామతోగతిః" అనే సూత్రం ప్రకారం అంకె 52అవుతుంది. రుణం: 52.

అంటే ఎనిమిది ఆరుల నలభై ఎనిమిది అనగా శేషం 4 మిగులుతుంది. అంటే ధనం: 1, రుణం: 4 అయ్యింది. ధనం కంటే రుణం ఎక్కువైనప్పుడు కృష్ణమూర్తి అక్కడ యిల్లు కట్టడానికి వీల్లేదు. ఇదీ రెండో గండం. ఇది 'వర్గుల' పరిస్థితి. అందుచేత ఈ ఆధునిక యుగంలో కృష్ణమూర్తి అష్టకష్టాలుపడి 'ఆగ్నేయం'లో ఇల్లు కట్టినా (అతనిది 'క' వర్గం. క వర్గానికి ఆగ్నేయం ఉత్తమం). ఆ యిల్లు అతని కుమారుడికి పనికిరాదు.

అంచేత ఆధునిక శాస్త్రవేత్తలు వాస్తులో 'వర్గు' పద్ధతిని ఛాందసంగా కొట్టిపారవేసి శాస్త్రం నుంచి పరిత్యజించాలంటున్నారు వర్గును.

ఈ పద్ధతి ఆచరణీయం కూడా కాదు కనుక 'వర్గు'ను పట్టుకుని వేలాడే వాస్తుజ్ఞులు, గృహస్థులు ఈ 'వర్గు'ను పాటించక పోవడం ఉభయత్రా మంచిది.





## అయ్యోర్లు

5వ పేజీ కొరవ

ప్రకటిస్తుండడం వల్ల, ఈ టెస్ట్ వ్రాసిన విద్యార్థుల మార్కులు బహిరంగంగా ప్రకటిస్తే ఈ వ్యవహారంలోని అన్ని సమస్యలు పరిష్కారమై పోతాయి.

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

ఏర్పాటైన టెలికాం సెంటర్ కొంత కాలం ఆదాయంలో నడిచింది. ప్రస్తుతం టౌన్‌లో విపరీతంగా పెరిగిపోయిన ఎస్టీడి బూత్‌ల పోటీను టెలికాం సెంటర్ తట్టుకోలేక పోతుంది. అదిగాక ఈ సెంటర్ నిర్వహణలో అధికారులు చిత్తశుద్ధితో వ్యవహరించడం లేదు. ఇక్కడ పల్స్‌రేటు తెలిపే కంప్యూటర్ మిషన్, టెలిగ్రామ్‌లకు సంబంధించిన కంప్యూటర్లు తరచూ మొరాయిస్తున్నాయి. దీనికి తోడు ఈ సెంటర్ మారుమూల సందులో ఉండడం వల్ల వాడకందారులకు అందుబాటులో లేదు. ఈ టెలికాం సెంటర్‌లో గతంలో ఫ్యాక్స్ సౌకర్యం ఉండేది. ఈ మిషన్ కూడా ప్రస్తుతం పనిచేయడం లేదు. అద్దె భవనంలో నడుస్తున్న ఈ టెలికాం సెంటర్‌లో ఆరుగురు సిబ్బందికి జీతభత్యాలు, భవనం అద్దె, కరెంట్ ఛార్జీలకు దాదాపు 35 వేలు ఖర్చవుతుంది. అయితే టెలిఫోను, టెలిగ్రాంల వినియోగం ద్వారా ఈ టెలికాం సెంటర్‌కు 15వేలకు మించి రాబడి రావడం లేదు. అంటే ఈ సెంటర్ 20వేల నష్టంతో నడుస్తుంది. ఈ సెంటర్ లాభాల బాట నడవాలంటే దీన్ని మెయిన్ బజారుకు మార్చాల్సి వుంది.

### ఆత్మకూరు ఆసుపత్రి అభివృద్ధికి 10లక్షలు

ఆత్మకూరులోని ప్రభుత్వ ఆసుపత్రిలో వివిధ అభివృద్ధి పనులు చేయను 10లక్షల రూపాయలు వెచ్చించనున్నట్లు ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య చెప్పారు. 3తేది ఆసుపత్రిలో జరిగిన అభివృద్ధి కమిటీ సమావేశంలో ఎమ్మెల్యే మాట్లాడారు. గతంలో ఆత్మకూరు ప్రభుత్వాసుపత్రికి ఎంతో పేరుండేదని, ప్రస్తుతం ప్రైవేట్ ఆసుపత్రుల వారు ఈ పేరు చేజిక్కించుకున్నట్లు చెప్పారు. ప్రభుత్వాసుపత్రి వైద్యులు, ఇతర సిబ్బంది తమ సేవల ద్వారా రోగులను సంతృప్తిపర్చగల్గితే ఎక్కువ మంది రోగులొస్తారు. ఏడాదిలోపుగా ఆసుపత్రిలో అత్యాధునిక ఆపరేషన్ థియేటర్ ఏర్పాటు చేయిస్తాను. అవుట్ పేషంట్స్ విభాగంలోని హాలులో మార్బుల్ టైల్స్ వేయిస్తాను. అదనంగా మరో బ్లాకు, ఇద్దరు డాక్టర్లు, స్టాఫ్‌నర్స్‌ల పోస్టులు మంజూరు చేయిస్తానని ఎమ్మెల్యే హామీ ఇచ్చారు. ఈ సమావేశంలో ప్రభుత్వాసుపత్రి డాక్టర్ ఆదినారాయణరెడ్డి కూడా పాల్గొన్నారు.

### ఆత్మకూరు పినాకినీ గ్రామీణ బ్యాంకు

ఆత్మకూరు బిఎస్ఆర్ సెంటర్‌లో కొత్తగా పినాకినీ గ్రామీణ బ్యాంకు శాఖను పెడుతున్నారు. దీన్ని సిండికేట్ బ్యాంకు జనరల్ మేనేజర్ ఆర్.చంద్రశేఖర్ 11తేది ప్రారంభిస్తారని గ్రామీణ బ్యాంకు మేనేజర్ ఫణిరాజకుమార్ చెప్పారు.

### అక్షర సంక్రాంతిలో అందని పుస్తకాలు

అక్షర సంక్రాంతి కార్యక్రమం సైదాపురం మండలంలో నామ్‌కే వాస్తేగా నడుస్తుంది. నవంబర్ 1తేది సైదాపురం, చాగణం, అనంతమడుగు, మర్లపూడి, ఊటుకూరు, కలిచేడు, తలుపూరు గ్రామాల్లో ఈ కార్యక్రమాన్ని ప్రారంభించారు. కాని ఇంత వరకు పలకలు, పుస్తకాలు పంపిణీ జరగలేదు. పథకం ఇలా దిగేడిస్తే సంక్రాంతి చదువులెట్లా వస్తాయి.

### వెంకటగిరిలో మినుము పంటపై ఆసక్తి

వెంకటగిరి ప్రాంత రైతులు తక్కువకాల పంటల వైపు మొగ్గు చూపుతున్నారు. వర్షాలు పడక చెరువుల్లో నీళ్లు లేక పోవడం వల్ల రైతులు దీర్ఘకాలిక పంటలు వేయడం లేదు. మినుము, పెసర, నువ్వులాంటి మెట్ట పంటలు సాగు చేస్తున్నారు. గతంలో ఎప్పుడూ లేనంతగా 167 హెక్టార్లలో ప్రస్తుతం మినుములు సాగుచేస్తున్నారు. వర్షాలు పడకపోవడం, కె.వి.కెనాల్ కాల్వ నీళ్లు వాడుకొనే అవకాశం లేకుండా పోవడంతో రైతులు తక్కువ కాల పంటలను పండించక తప్పడం లేదు.

### చెట్ల క్రింద చదువులు

జిల్లాలో భవన వసతిలేని పాఠశాల లేదని అధికారులు చెబుతుంటారు. కాని సంగం మండలం జెండాదిబ్బ గ్రామంలో విద్యార్థులు ఇంకా చెట్ల క్రిందే తమ చదువులు కొనసాగిస్తున్నారు. నాలుగు చినుకులు పడినా, ఎండ ఎక్కువైనా పాఠశాలకు సెలవులు ప్రకటించేస్తారు. ఈ గ్రామంలో స్కూల్ కట్టించేందుకు కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి లక్ష రూపాయలు మంజూరు చేయించారు. ఈ డబ్బులు చాలవని కాంట్రాక్టర్ లెవరూ దీని నిర్మాణానికి ముందుకు రాలేదు. సర్పంచ్ భర్త బేస్‌మట్టం వరకు ఈ నిర్మాణపు పనులు పూర్తి చేసి నిధులు అయిపోయాయని చెప్పారు. అదనపు నిధులు మంజూరయ్యే వరకు జెండా దిబ్బ పిల్లలు చెట్ల క్రిందే చదువులు కొనసాగించక తప్పదు.



నెల్లూరు వచ్చిన కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామంత్రి వెంకయ్య నాయుడ్ని సత్కరిస్తున్న నారాయణ విద్యా సంస్థల అధినేత నారాయణ.

### బస్‌షెల్టర్ ప్రారంభించిన రాజ్యలక్ష్మమ్మ

వెంకటగిరిలోని పాత బస్టాండ్ వద్ద కొత్తగా కట్టిన బస్ షెల్టర్‌ను ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ 9తేది ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ బస్టాండులో ప్రయాణీకుల సౌకర్యార్థం పంచాయతీ ఆధ్వర్యంలో ఈ బస్ షెల్టర్‌ను నిర్మించినట్లు చెప్పారు. ప్రక్కనే మహిళల కోసం మరుగుదొడ్లు నిర్మిస్తామన్నారు. ఇదే విధంగా కాశీపేట సెంటర్‌లో కూడా బస్ షెల్టర్‌ను నిర్మిస్తామన్నారు. టౌన్‌లోని అంగన్‌వాడీ కేంద్రాన్ని కూడా ఎమ్మెల్యే ప్రారంభించారు. సమస్యలపై ప్రజలిచ్చిన అర్జీలు స్వీకరించారు. రబీ సీజన్‌లో స్థానిక రైతులు ఉపయోగించుకొనేందుకు వీలుగా తెలుగుగంగ నీటిని ఇవ్వకపోతే ఉద్యమిస్తానన్నారు. గూడూరు ఆర్డీఓ సుబ్రహ్మణ్యంరెడ్డి ఎమ్మెల్యే వెంట పర్యటించారు.

### బెస్ట్ రీసెర్చ్ పేపర్ అవార్డు

కావలి పి.జి. సెంటర్‌లోని జువాలజీ విభాగంలోని పరిశోధనా విద్యార్థికి 'బెస్ట్ రీసెర్చ్ పేపర్ అవార్డు' లభించింది. అక్టోబరు నెల 29, 30తేదీల్లో రాజమండ్రిలో జరిగిన పర్యావరణం - ప్రస్తుత ఆక్వాకల్చర్ పరిస్థితి అనే అంశంపై జరిగిన జాతీయ సదస్సులో జి.సుజయ్ కుమార్ కంప్యూటర్ లీనియర్ ప్రోగ్రాంను ఉపయోగించి రొయ్యల మేతను తయారు చేసే విధానంపై సమర్పించిన పరిశోధనా వ్యాసానికి ఈ అవార్డు నిచ్చారు. హైదరాబాద్‌కు చెందిన ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ ఆక్వాటిక్ బయోలజిస్ట్స్ సంస్థ ఈ సదస్సును ఏర్పాటు చేసింది. జి.సుజయ్ కుమార్ పి.జి.సెంటర్ అసిస్టెంట్ ప్రొఫెసర్ డాక్టర్ శ్రీనివాసులురెడ్డి పర్యవేక్షణలో యం.ఫిల్ రీసెర్చ్ చేస్తున్నారు.

నిన్ను చూశాక చిత్రంలో మాధవన్, స్నేహ

# తమిళులకు నా 'తళుకు' చూపాలని ఉంది

తెలుగు ప్రజలకు అందించిన స్థాయిలో తన అందాలను తమిళ ప్రేక్షకులకు చూపించలేక పోతున్నానని రమ్యకృష్ణ తెగబాధ పడుతోంది. సినిమాల్లో అందాలను తెరమీద ఆరవేయడం చాలా అవసరం. దీనికి తానెప్పుడూ వ్యతిరేకిని కాదంటుంది రమ్యకృష్ణ. ఇటీవల ఆమె ఒక తమిళ పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చింది. దానిలో తానెప్పుడూ దేవుడిచ్చిన సౌందర్యాన్ని ప్రదర్శించే విషయంలో

## రమ్యకృష్ణ ఆశ

వెనకడుగు వేసిందిలేదంది. గ్లామర్ పాత్రల్లో నటించడమంటేచాలా ఇష్టం. నా అందాన్ని ఆరబోయగల క్యారక్టర్లేవీ నాకు తమిళంలో ఇంత వరకూ రాలేదని అసంతృప్తి వెలిబుచ్చింది. అందువల్లే తమిళ చిత్రాల్లో అందాలను ఆరబోయలేదు. నన్ను ఎవరూ ఎక్స్‌పోజింగ్ చేయమన్నా తిరస్కరించే ప్రశ్నే లేదంటుంది రమ్యకృష్ణ.

## సినిమా హిట్టు - నటుడి స్థాయి పెంచుతుంది

హీరో నాగార్జున నిర్మాతగా తీసిన ప్రేమకథ చిత్రానికి ఉత్తమ తృతీయ చిత్రంగా నంది అవార్డు వచ్చింది. ఈ విషయమై నాగార్జున మాట్లాడుతూఆ చిత్రం హిట్టయి ప్రేక్షకుల మెప్పుపొంది, నాలుగు డబ్బులు తెచ్చి పెట్టి వుంటే నిర్మాతగా ఇంకెక్కువ సంతోషపడేవాడ్ని. ఎందుకంటే సినిమా హిట్టే ఒక నటుడ్ని పాపులర్ చేస్తుంది. ఒక సంస్థ పరువుని, బరువుని మోస్తుంది. ఒక నిర్మాతకు ఊపిరిపోసి మరో సినిమా తీయాలనే ఉత్సాహాన్నిస్తుంది. కానీ అవార్డు అనేది మేధావులు కూర్చొని నిర్ణయించేది. కానీ సినిమా అన్నది అన్ని వర్గాల ప్రేక్షకులు విజయం చేకూర్చాల్సి వుందని చెప్పుకొచ్చారు.

## కష్టపడితేనే పైకివస్తారు

ఎవరైనా జీవితంలో పైకిరావాలంటే గట్టి కృషి చేయడంతో పాటు కొన్ని నియమాలను, సిద్ధాంతాలను ఏర్పచుకోవాలని హీరో జగపతిబాబు చెప్పారు. ప్రతి నిముషం మన ఉనికి కోసం పోరాటం చేయడంతోపాటు దీని కోసం కృషి చేయాలి. నిరాడంబర జీవితం, అత్యాసకు దూరంగా వుంటే ఆ మనిషి తప్పకుండా పైకి వస్తారంటున్నారు జగపతిబాబు.

# పాపం! ఎ.ఆర్. రెహమాన్

భారత సినీ పరిశ్రమలో కోట్లాది రూపాయల పారితోషికం తీసుకొంటున్న వైశక సంగీత దర్శకుడు రెహ్మాన్. లండన్, అమెరికాలో పలు కచ్చేరీలు చేస్తూ బిజీగావున్న రెహ్మాన్ తరచూ కోర్టుకు రావాల్సి వస్తుంది. దీనికి కారణం జయలలిత పెంపుడు కొడుకు సుధాకరన్

## 'జయ' కేసుల్లో ఇరుక్కున్న ఫలితం

పెళ్లికి రెహ్మాన్ కచేరి చేయడమే. జయలలిత, శశికళలపై కొనసాగుతున్న కేసుల్లో రాబడికి మించి సంపాదించారనే కేసులో రెహ్మాన్ ఒక సాక్షిగా విచారణకు హాజరు కావాలంటూ తరచూ సమన్లు వస్తున్నాయి. కోర్టులతో గొడవెందుకని లక్షలు ధార్మిలుగా పెట్టుకొని విదేశాల నుంచి వస్తున్నాడీ సంగీత దర్శకుడు.

## నా టైమ్ బాగోలేదు

పెళ్లి సందడి వంటి సూపర్ హిట్ చిత్రంలో నటించినా రవళికి తెలుగులో మంచి అవకాశాలు రాలేదు. ఈ మధ్య నిన్నే ప్రేమిస్తా చిత్రంలో అతిథి పాత్ర పోషించిన రవళి, తిరుమల తిరుపతి వెంకటేశ చిత్రంలో నటిస్తూ షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడింది. నాకు తెలుగులో ఎందుకు అవకాశాలు రావడంలేదో అర్థం కావడం లేదు. నేను టైమ్‌ను నమ్ముతాను. కాబట్టి బ్యాడ్ టైమ్ అనుకొంటున్నాను. అమ్మ ఎప్పుడూ అంటుండేది ఆర్టిస్టు జీవితం చక్రం లాంటిదని. ఒడిదుడుకులు సహజమంటుండేది. నాకుమళ్లీ మంచి సమయం వస్తుందని నమ్మకం. అసలు హీరోయిన్‌గా ఇంతస్థాయి వస్తుందని ఊహించలేదు. వచ్చింది. కాబట్టి మళ్లీ పూర్వ వైభవం పొందగలనను కొంటున్నాను. అయితే తెలుగు హీరోయిన్‌గా, తమిళ, కన్నడ మలయాళంలో నాకు ఇస్తున్న గౌరవం తెల్సుకొన్నప్పుడు మాత్రం తెలుగులో చేయలేక పోతున్నాననే బాధను మర్చిపోతున్నానని వివరించింది.

# విజయశాంతి నవరసాల సారం

నవరసాల్లో తనకు నాలుగంటే ఇష్టమన్నారు కథానాయిక విజయశాంతి. కరుణ, రౌద్రం, వీరం, శాంతాలను ఎక్కువగా ఇష్టపడతాను. ప్రతి మనిషికీ సామాజిక స్పృహ వుండి తీరాలి. అది వ్యక్తిగత పురోగమనానికే కాదు, యావత్ మానవ జాతి పురోగమనానికి దోహదపడుతుంది. ఈ దృక్పథంలో ఆశించినప్పుడు ప్రతి వారికీ గుర్తుకు రావాల్సిన రసాలే నేను చెప్పిన ఈ నాలుగు రసాలు. సాటివాడు కష్టాల్లో వున్నప్పుడు వారిని కరుణతో ఆదుకొంటే ఓ మదర్‌థెరిస్సా అవుతారు. న్యాయం విజయం సాధించడానికి విప్లవించింది వీరం, రౌద్రం చూపిస్తే ఒక అల్లూరి సీతారామరాజు అవుతాడు. శాంతి మార్గంలో నడిస్తే ఒక గాంధీ అవుతాడు. మహామూర్తులు ఆదర్శంగా నడచిన ఈ రసాల బాటలు తనకిష్టమంటూ చెప్పుకొచ్చారు విజయశాంతి.

## యువతరాన్ని ఆకట్టుకొంటే చాలు

యువతరాన్ని ఆకట్టుకొనే ఏ అంశంతోనైనా సినిమా తీస్తే ఆ సినిమా బ్రహ్మాండంగా ఆడుతుందని దర్శకుడు సానాయాదిరెడ్డి చెప్పారు. దర్శకునిగా గతంలో ఎవరి వద్ద పనిచేయకపోయినా ఆయన తీసిన బ్యాచ్‌లర్స్ చిత్రం ఘనవిజయం సాధించింది. ప్రస్తుతం పరిశ్రమలో వున్న ట్రెండ్‌ను గూర్చి మాట్లాడుతూ మహిళలు టీవీ సీరియల్స్‌కు, ఛానల్ సినిమాలకు అలవాటు పడిపోయారు. వాళ్లను టి.విల ముందు నుండి లేపాలంటే చాలా కష్టమైన పని. అందుకే కుర్రాళ్లను దృష్టిలో పెట్టుకొని సినిమా తీస్తే ఎలా వుంటుందని బ్యాచ్‌లర్స్ చిత్రం తీశాను. చిత్రం కుర్రాళ్ల దృష్టిని ఆకర్షిస్తే వాళ్లు మరో వంద మందికి చెబుతారు. అలా మౌత్ పబ్లిసిటీ పెరుగుతుంది. పది చోట్ల డిస్కషన్ మొదలవుతుంది. సినిమాకో క్రేజ్ ఏర్పడుతుంది. ఇవన్నీ ఆలోచించి తీసిందే బ్యాచ్‌లర్స్ సినిమా అన్నారాయన.

## హైదరాబాదు సినిమా వార్తలు

### సొంత నిర్ణయాలే బెస్ట్

నా వరకు నేను సినిమాకు సంబంధించికాని, నా వ్యక్తిగత విషయాలకు సంబంధించినది కాని ఊహించినది జరగకపోతే దాన్ని గూర్చి ఆలోచిస్తు మనసు పాడుచేసుకోను. ఆ క్షణంలో కొద్దిగా ఫీలయ్యి వెంటనే మర్చిపోతానన్నారు హీరో సురేష్. తర్వాత నేను చేయబోయే పనుల మీద దాని ప్రభావం పడకుండా జాగ్రత్త పడతాను. దీని ఫలితంగా కెరీర్ పరంగా, వ్యక్తిగతంగా ఎటువంటి ఇబ్బందులు కలగలేదు. అన్నింటా సొంత నిర్ణయాలే బెస్ట్ అంటున్నారు.

# తెనాలి చూడాలి, హాయిగా నవ్వాలి

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

నెల్లూరీయుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ప్రముఖ నేపథ్యగాయకుడుగానే గాక మంచి నటుడుగా ఉత్తమ చిత్రాల నిర్మాతగా కూడా పేరు ప్రఖ్యాతులు గడించాడు. గతంలో ఆయన కోదండపాణి ఫిలిం సర్క్యూట్స్ పతాకం మీద "శుభసంకల్పం", "భామనే సత్యభామనే" చిత్రాలు నిర్మించాడు. అవి ఉత్తమ విలువలను సంతరించుకొని, వినోదాత్మక చిత్రాల పట్ల ఆయనకు గల అభిరుచిని, నైపుణ్యాన్ని వెల్లడించాయి. ఇప్పుడు తాజాగా ఆయన "తెనాలి" చిత్రాన్ని నిర్మించాడు. ఈ చిత్రం పూర్తి వినోదాత్మకంగా, కొత్త కథాంశంతో, కొత్త కొత్త ఇతర అంశాలతో ప్రేక్షకులను రంజింపజేస్తుంది.

సంగీత దర్శకుడు ఎ.ఆర్.రెహ్మాన్, చిత్ర దర్శకుడు కె.యస్.రవికుమార్‌ల సహకారంతో, తన పర్యవేక్షణలో ఈ చిత్రం రీ రికార్డింగు అమెరికాలో జరిపించాడు బాలు. రెండు పాటల్ని న్యూజిలాండ్‌లో చిత్రీకరించి, విదేశీ అందాలను చిత్రానికి జతకలిపాడు. చిత్రానికి ఆసక్తికరమైన నాణ్యతను పొదిగాడు. ఇది మరువరాని అనుభూతిగా అభివర్ణించాలి. తాను చేసే ప్రతి పని గణనీయంగా వుండాలనే దీక్షా దక్షతలు గల బాలును అభినందించక తప్పదు. కమల్‌కు బాలు చెప్పిన డబ్బింగు అతని ప్రతిభకు ప్రతిబింబం.

తెనాలి చిత్రంలో కథానాయకుడుగా కమలహాసన్ నటించాడు. కథానాయకుడి పూర్తి పేరు "తెనాలి రాముడు". అతను చదువుకునే బడిలో బోలెడు మంది రాముళ్లు ఉండటంతో గందరగోళం లేకుండా వుండేందుకు అతని పేరు కుదించి "తెనాలి" అని పిలవటం మామూలైంది. ఆ పేరే చిత్రానికి పెట్టారు. కమల్‌హాసన్ తెనాలి పాత్రను పోషించాడంటే అది తప్పకుండా వైవిధ్యంతో విలసిల్లే పాత్రగా చెప్పవచ్చు. మానసిక స్థితి కొంత తల్లక్రిందులై భయంతో కూడుకున్న పాత్ర ఇది. మానసిక బలహీనతతో ఎలుకను చూచి వణికి పోతాడు. కాని మనోబలంతో ఒక్కొసారి ఏనుగు కుంభస్థలాన్ని బ్రద్దలు కొట్టాడు. ఈ భయస్థుడు విలన్లను చిత్తుగా బాదేస్తాడు. ఒక పిల్లిని గదిలో వేసి తరిమికొట్టుంటే అది ఆత్మరక్షణకు పులిలా విజృంభించినట్టు విలన్ల అతన్ని

తరువ 7వ పేజీలో

# వారఫలాలు

11-11-2000తేది నుండి 17-11-2000తేది వరకు వృషభంలో వక్ర గురు, శనులు; మిధునంలో రాహువు; కన్యలో కుజ; ధనుస్సులో శుక్ర, కేతువులు; తులలో బుధుడు, 16తేది వరకు రవి; పిదప వృశ్చికంలో రవి; మేష, వృషభ, మిధునాలలో చంద్రుడు.

### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థికంగా బాగుండి వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం పెరుగుతుంది. కాని ఖర్చులు మాత్రం తగ్గవు. కుటుంబ సమస్యలు సర్దుకుంటాయి. కొన్ని బాధ్యతలను ఇతరులపై పెట్టగలరు. బంధుమిత్రుల సహాయం, అనుకున్న పనులు సాధించుకోవడం, ఆత్మీయుల రాకపోకలుంటాయి. ఉద్యోగులు వారాంతంలో అధికార వర్గాల వల్ల ఇబ్బందులు పడతారు. ఆకస్మిక ప్రయాణాలు, రాజకీయ వర్గాల వారికి మంచి ప్రోద్బలం, ఉద్యోగార్థులకు కొద్ది నిరాశ ఉంటుంది.

### వృషభం
(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ముఖ్యమైన పనులు నిదానంగా జరుగుతాయి. అధికార వర్గంతో స్నేహం విధి నిర్వహణలో గుర్తింపు పొందుతారు. బంధువుల రాకపోకలు, అనుకోని ప్రయాణాలుంటాయి. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా ఉండదు. రాజకీయ పలుకుబడి పెరుగుతుంది. తగాదాలు, మనస్పర్థలు సర్దుకుంటాయి.

### మిధునం
(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

అప్పుడప్పుడు వ్యవహారపరమైన ఒడుదుకులుంటాయి. మానసిక టెన్షన్ ఎక్కువగా ఉంటుంది. తంద్రివర్గ బంధువులకు అనారోగ్య బాధలుంటాయి. స్థిరాస్తుల ద్వారా రావలసిన ఆదాయం స్వల్పంగా లభిస్తుంది. మిత్ర, బంధువులతో విభేదాలు సర్దుకుంటాయి.

### కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

మీకు, కుటుంబ సభ్యులకు ఆరోగ్యపరంగా జాగ్రత్తలు అవసరం. పాత ఆస్తి తగాదాలు, రుణ తగాదాలు పెరుగవచ్చు. జాగ్రత్తగా ఉంటే మంచిది. ఉద్యోగులకు అధికారుల సహకారం బాగుంటుంది. అధికారిక ప్రయాణాలు, శుభకార్య ప్రయాణాలు ఉంటాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. రాజకీయ, శాస్త్ర సాంకేతిక రంగాల వారికి ప్రజాదరణ, ఉద్యోగ ప్రాప్తి, దూర దేశ ప్రయాణావకాశాలు లభించవచ్చును. శ్వాసకోశ రుగ్మతలు కలుగవచ్చును.

### సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరగుతుంది. అధికార వర్గంతో సన్నిహితంగా మెలుగుతారు. సాంకేతిక రంగాల వారికి విదేశీ అవకాశాలు, రాజకీయ రంగాల వారికి పలుకుబడి ఆదరణ బాగుంటుంది. స్థిరాస్తులపై రాబడి అందుతుంది. ఉద్యోగులకు గుర్తింపు, స్వల్ప రాయితీలు, రాబడి పొందుతారు. శిరస్సు, నేత్ర సంబంధమైన రుగ్మతలుంటాయి. విద్యాప్రగతి బాగుంటుంది. బంధుమిత్రులకు డబ్బు, మాట రూపంలో సహాయం చేస్తారు. ప్రయాణాలు తప్పవు. వ్యాపార వర్గాలకు పెట్టుబడి అవకాశాలు అందుబాటులోకి వస్తాయి. విభేదాలు, సమస్యలు సర్దుబాటు కాగలవు. సొంత పనులు అనుకూలంగా జరిగిపోతాయి.

### కన్య
(ఉత్తర2,3,4పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

బలహీనత, కండరాల నొప్పుల వంటి రుగ్మతలు ఏర్పడగలవు. తొందరపాటు, కోపం, పట్టుదల ఎక్కువగా వుండి చిన్న చిన్న సమస్యలు కలుగవచ్చును. కుటుంబ సభ్యుల సహకారం బాగుంటుంది. సోదర వర్గం వల్ల ఉపకారం పొందుతారు. రాజకీయంగా పలుకుబడి, ఆధిపత్యం బాగుంటుంది. శాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక రంగాల వారికి మంచి అవకాశాలు, ప్రశంసలు లభిస్తాయి. ఆదాయం గతంలో కంటె కొద్దిగా పెరుగుతుంది.

## పంచాంగం

తేది 11 శనివారం కార్తీక పూర్ణిమ. గురునానక్ జయంతి. తేది 14 మంగళవారం నెహ్రూ జయంతి.

నవంబరు తిథులు

కార్తీక బహుళ

తేది 11శని పూర్ణిమ రా 3.15గం.వ

తేది 12ఆది పాడ్యమి రా2.00గం.వ

తేది13సోమ విదియ రా12.10గం.వ

తేది14మంగళ తదియరా10.20గం.వ

తేది 15 బుధ చతుర్థి రా8.10గం.వ

తేది 16గురు పంచమి రా6.00గం.వ

తేది 17శుక్ర షష్ఠి ప 3.45 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

### తుల
(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ముఖ్యమైన పనులలో ఆటంకాలు ఎదురుకాగలవు. కుటుంబ సభ్యుల సహకారం మీకుంటుంది. ఆత్మీయులకు అనారోగ్య సమస్యలుంటాయి. బంధువులతో విభేదాలు పరిష్కారానికి వస్తాయి. రుణాలు, పెట్టుబడులు సమయానికి అందక బాధపడతారు. ఆదాయం సామాన్యంగా ఉంటుంది. ఖర్చులు బాగా పెరిగిపోతాయి. గృహ నిర్మాణాలు, రిపేర్లు, వాహన రిపేర్లు జరుగుతాయి.

### వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థికపరమైన ఒడుదుడుకులుంటాయి. ఒక్కొక్కసారి అప్పుచేయవలసి వస్తుంది. వ్యాపార రంగం ఆశావహంగా ఉండదు. వ్యవసాయదారులకు, పెట్టుబడిదారులకు అవకాశాలుంటాయి. విద్యా వ్యాసంగం బాగుంటుంది. పేరు ప్రతిష్ఠల కొరకు ప్రాకులాడతారు. ఉద్యోగస్తులకు అదనపు బాధ్యతలు పైనబడగలవు. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. అధికారపరమైన చిక్కులుంటాయి.

### ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

వచ్చే ఆదాయానికి, పెట్టే ఖర్చులకు సంబంధం ఉండదు. వస్తు నష్టం, ఇతరుల అవసరాలకు సహాయపడటం జరుగుతుంది. ఇతరుల సలహాల వల్ల చిక్కులు రావచ్చును. ఉద్యోగపరంగా పనివత్తిడి పెరుగుతుంది. కుటుంబ సభ్యులకు, మీకు ఆరోగ్యం సరిగా ఉండదు. వ్యాపార, వ్యవసాయ రంగాలలో మంచి అవకాశాలు తప్పిపోతాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. స్థిరాస్తుల వల్ల సమస్యలు రాకుండా జాగ్రత్త పడాలి. రాజకీయంగా ఇబ్బందులు కలుగవచ్చు. వారాంతంలో ప్రయాణాలు ఏర్పడుతాయి. శుభకార్య నిర్ణయాలు, కొత్త వస్తువులు కొనడం జరుగుతుంది.

### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఉద్యోగపరమైన, ఆర్థికపరమైన పనులు చక్కగా జరిగిపోతాయి. ప్రయాణాలకు, విదేశీయానాలకు ఆటంకాలు రావచ్చును. వారాంతంలో శ్వాసకోశ రుగ్మతలు జ్వరాది అనారోగ్య బాధలుంటాయి. వృత్తి, వ్యాపార రంగాలలో వారికి ఆదాయం బాగుంటుంది. వ్యవసాయదారులకు మేలుగా ఉండదు. బంధువుల రాకపోకలుంటాయి.

### కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

తొందరపాటు వల్ల తగాదాలు, చిక్కులు రావచ్చును. అవసరాలకు రుణం చేయక తప్పదు. ఆర్థికంగా బాగుండి ఆదాయం పెరిగినా అనుకోని ఖర్చుల భారం తప్పదు. వారాంతంలో శుభవార్తలు వినడం, రక్త సంబంధీకుల వల్ల సహాయం పొందడం, వ్యాపార విస్తరణను, పెట్టుబడికి అవకాశాలు కలుగడం జరుగుతుంది.

### మీనం
(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

బంధు మిత్రులతో విభేదాలు వచ్చే అవకాశాలున్నాయి. తొందరపాటు, కోపం ఎక్కువగా ఉంటుంది. అనుకున్న పనులు సక్రమంగానే జరుగుతాయి. వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి సంతృప్తి ఉండదు. నిరాశపడగలరు. సాంకేతిక రంగాల వారికి ఉద్యోగమార్పు, ఉద్యోగావకాశాలు వస్తాయి. ఆరోగ్య లోపం కలుగవచ్చును.

# జనవాణి

3వ పేజీ కొరవ

భారతదేశం నా మాతృభూమి. నా మాతృభూమి కోసం నేను ప్రాణాలర్పించడానికి సిద్ధం" అనే స్థిర సంకల్పం గల దేశ భక్తుల సంఘటన అంటే బాగుంటుంది. లాల్ బహదూర్‌శాస్త్రి గారు ప్రధానిగా వున్న రోజుల్లో యుద్ధం వస్తే నా తరఫున దేశం కోసం ప్రాణాలొడ్డే లక్షలాది వీరులను సమర్పిస్తాను అని ధృఢమైన హామీ ఇచ్చిన సంస్థ ఆర్ఎస్ఎస్ ఒక్కటే. ప్రకృతి వైపరీత్యాల సమయంలో ఆర్ఎస్ఎస్ సేవలు బహుధా ప్రశంసనీయం. అటువంటి సేవా దృక్పథం కల్గిన సంస్థను దాని లక్ష్యం వినాశనమేనా అని ప్రశ్నించడం సబబుకాదు.

నెల్లూరు    ఐ.వి. రఘురామమూర్తి

## పుణ్యంకన్నా పాపమేజాస్తి

మనదేశ మహిళలకు పతిభక్తి, దైవభక్తి చాలా ఎక్కువ. ఏ పండుగ వచ్చినా పూజాకార్యక్రమాలను వ్రతాలను ఏకాగ్రతతో ఉపవాసాలతో నిర్వహిస్తుంటారు. మంచిదే. కాని నాగుల చవితి నాడు మాత్రం పాము పుట్టలలో పాలు, గ్రుడ్లు, పండ్లువేసి నానా గలీజు చేస్తారు. పాము పటాన్ని పెట్టి, నైవేద్యాలు పెట్టుకొని పూజ చేస్తే నిజంగా మంచిదే. కాని పాములు సురక్షితంగా నివశించే ఆ పుట్టలను కలుషితం చేసి, అవి చనిపోవడానికి భక్తులే కారణమవుతున్నారు. కాని ఈ నిజాన్ని చాలా మంది భక్తి పారవశ్యంలో తెలుసుకోలేక పోతున్నారు. పాము పుట్టలను విషవాయువుల మయం చేసి, వాటిని చంపి పుణ్యం కన్నా పాపం మూటగట్టు కొంటున్నారు. జంతు ప్రేమికులు, స్వచ్ఛంద సేవా సంస్థలు, మూఢ నమ్మకాలను ఎదిరించేవారు. ఈ చర్యలను అరికట్టాలి.

నెల్లూరు    సోలా జానకీదేవి

## ప్రహసనంగా పిఎంఆర్‌వై స్కీమ్!

ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన పథకం ఒక ప్రహసనంగా తయారయ్యింది. నిరుద్యోగులను ఈ పథకానికి ఎంపిక చేస్తారు. ఆశ కల్పిస్తారు. ట్రైనింగ్ కూడా ఇస్తారు. కాని చివరికి బ్యాంకు రుణం మంజూరు చేయరు. కుంటిసాకులతో రుణం తిరస్కరిస్తారు. నిరుద్యోగుల జీవితాలతో ప్రభుత్వం ఈ విధంగా చెలగాటమాడడం సబబు కాదు.

నెల్లూరు    వి.శ్రీహరి

## చదువుకుందాం-రండి!

52ఏళ్ల స్వాతంత్ర్య సముపార్జనానంతరం కూడా జనాభాలో అత్యధికులు అక్షర జ్ఞానం లేక అజ్ఞానాంధకారంలో అల్లాడుతూనే వున్నారు. మనల్ని నిత్యం బాధించే, వేధించే అనేకానేక సమస్యల్ని శాశ్వతంగా పరిష్కరించడానికి చేపట్టవల్సిన అత్యంత శక్తివంతమైన అక్షర సంక్రాంతిని మనం సాధించగల్గితే అప్పుడే మనకు నిజమైన సంక్రాంతి. దేశమంటే కొశలం. ప్రజ్ఞలేని చపటాయిలు కాదు. విజ్ఞానవంతులమయమైన దేశమే ప్రపంచ పటంలో గొప్పగా, పోటీగా రాణించగలదు. లేని నాడు వెనుకబడిన అడుగై అడుగునపడి, అడుగడుగునా అష్టకష్టాల పాలవుతుంది. అందరి అపహాస్యాలకు నెలవవుతుంది. అందుకే సంపూర్ణ అక్షరాస్యత సాధించాలనే ఉత్తమ లక్ష్యంతో మన రాష్ట్ర ప్రభుత్వం అక్షర సంక్రాంతి పథకానికి శ్రుడు శ్రీకారం చుట్టింది. ఇది నూరురోజుల పథకం. విద్యావంతులందరూ `స్వంత లాభం కొంత మానుకొని' పూనిగట్టిగా ప్రయత్నిస్తే కాదేది అసాధ్యం.

గూడూరు    వి.వి. ప్రభాకరరావు

## ఈ నాణాలు చెల్లవా?

ఐదు, పది, ఇరవై ఐదు పైసల నాణాలు చెల్లడంలేదని పలువురు ఈ నాణాలను తీసుకొనేందుకు నిరాకరిస్తున్నారు. పల్లెల్లో ఈ నాణాలు చెల్లడం లేదని బాహాటంగా చెప్తున్నారు. దీనివల్ల కృత్రిమంగా చిల్లర సమస్య ఏర్పడింది. ఈ నాణాల చెల్లుబాటు విషయమై ప్రభుత్వం స్పష్టమైన వివరణతో కూడిన ప్రకటనను పత్రికలు, రేడియో, టివిల ద్వారా ప్రచారం చేసి ప్రజల్లోగల భయాందోళనలను తొలగించమని విజ్ఞప్తి.

గరిమనపంట    నాగేశ్వరరావు

## విమానయాత్రే... విషాదయాత్ర

ప్రమాదాలు, హైజాకింగ్‌లు, వాతావరణం సరిగ్గా అనుకూలించకపోవడం, గమ్యం చేరేవరకు గ్యారంటీ లేని ప్రయాణాలతో విమానయానం ఒడిదుడుకుల్ని ఎదుర్కొంటుంది. కాలం చెల్లిన విమానాలు, సాంకేతిక లోపాలు, ఎగిరీ ఎగరక ముందే రన్‌వేలను ఢీకొన్న సంఘటన, గాలిలోచక్రాలు ఊడిపోవడం వంటి సమస్యలు నిత్యకృత్యమైపోయాయి. గత సంవత్సరం డిశంబర్‌లో జరిగిన ఐసి 814 విమానం హైజాక్ దుర్ఘటన ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఈ సంవత్సరం జూలై 17తేది బీహార్ రాజధాని జనావాసాల మీద కుప్పకూలిన బోయింగ్ - 737 విమానం 55 మందిని పొట్టన పెట్టుకొంది. నెల క్రితం చెన్నై నుంచి బయలుదేరిన విమానం సాంకేతిక లోపం వల్ల మూడుసార్లు అత్యవసరంగా ల్యాండ్ అయ్యింది. అక్టోబర్ 31తేది తైవాన్ రాజధాని తైపేలో సింగపూర్ ఎయిర్ లైన్స్‌కు చెందిన విమానం కూలి పోయిన ఘటనలో 80 మంది చనిపోయారు. వీరిలో 15 మంది భారతీయులున్నారు. ఇప్పటికైనా అంతర్జాతీయ సమాజం విమాన ప్రమాదాల మీద దృష్టి కేంద్రీకరించాలి. అమాయక ప్రజల ప్రాణాలు రక్షించాలి.

చిట్టగుంట    సి. హెచ్.సోల్మన్‌రాజు

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

శాసనసభాధ్యక్ష పీఠం అధిరోహించారు. వ్యతిరేక బెజవాడ కుటుంబీకుడు గోపాలరెడ్డి గారు కాంగ్రెస్ పక్ష ప్రాబల్యంలో రెండు పర్యాయాలు మంత్రిత్వ పీఠం అధిరోహించారు. ఇంత వరకూ బాగానే వుంది. ఇక మీదట రాజకీయ వాతావరణమే మారిపోతున్నది. కమ్యూనిస్టు, సోషలిస్టు భావాలు ప్రజలలో ప్రాకిపోతున్నవి. ఇందుకు అనుగుణ్యమైన నాయకత్వం తయారు కావలసి వున్నది.

## నెల్లూరు సంగతులు

4వ పేజీ తరువాయి

అప్పటికప్పుడు నిర్ణయం తీసుకొనే చర్యల్లో భాగంగా 7తేది ఎస్పీ, జాయింట్ కలెక్టర్లు టౌనంతా తిరిగారు. గాంధీబొమ్మ వద్ద వున్న పెట్రోల్ బంకు ప్రభుత్వ స్థలాన్ని ఆక్రమించుకొని చక్కగా ముస్తాబయ్యిందని వెంటనే ప్రభుత్వ స్థలాన్ని వెంటనే అప్పగించాలని అధికారులు ఆ బంకు యజమానులను ఆదేశించారు. కొత్తహాల్ సెంటర్, ఓల్డ్ ఎమ్‌ల్ ప్రక్కనున్న టాక్సీ స్టాండ్‌ల వారిని అక్కడ నుంచి తొలగించి కో ఆపరేటివ్ బ్యాంకు ఎదురుగా మాత్రమే కార్లు నిలపాలన్నారు. అనంతరం చిన్నబజారుకు వెళ్లి అక్కడి పాత కూరగాయల మార్కెట్ స్థలంలో ఈ ప్రాంతానికి వచ్చే వాహనాలన్నింటిని నిలిపే అవకాశాలను పరిశీలించారు. మండపాల వీధిలో వన్‌వే ట్రాఫిక్‌ను అమలు చేశారు. ఎసి బొమ్మ నుంచి సుందర్‌తిలక్స్ వరకు గల రోడ్డును పార్కింగ్ చేసుకొనేలా చర్యలు తీసుకోమని ట్రాఫిక్ పోలీసులను ఆదేశించారు. రంగనాయకులపేట సమీపంలోని బర్మాషెల్ గుంట ప్రాంతానికి చేరుకొని అక్కడ మునిసిపాలిటీ, రైల్వే శాఖకు చెందిన స్థలంలో లారీ మెకానిక్ షెడ్‌లున్న ప్రదేశాన్ని పరిశీలించి అక్కడ నుంచి వాటిని ఆటోనగర్‌కు తరలించాలన్నారు. మద్రాసు బస్టాండ్ వద్దనున్న ఇనుప దుకాణాల యాజమాన్యం రోడ్డు పైనే ఇనుప చువ్వలు వేసి ఉండడంతో ఎస్పీ, జెసి వారిని మందలించారు. ఎసి కూరగాయల మార్కెట్ వెలుపల వ్యాపారం చేస్తున్న వారిని అక్కడి నుంచి తొలగించి మరో చోట పునరావాసం ఏర్పాటు చేస్తే ఎలా వుంటుందని జెసి మార్కెట్ కమిటీ స్పెషల్ గ్రేడ్ సెక్రటరీ ఆంజనేయరెడ్డిని పిలిపించి అడిగారు. మార్కెట్‌లో కూరగాయల షాపులకు బదులు కిరాణా షాపులు ఎందుకున్నాయని ప్రశ్నించారు. ఆత్మకూరు బస్టాండ్ నుండి రామలింగాపురం ట్రాఫిక్ సిగ్నల్ లైట్ల వరకు రోడ్డు మధ్యలో ట్రాఫిక్ డివైడర్‌లు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ఆక్రమణల తొలగింపు పరిస్థితి వారం వారం పరిశీలిస్తానని ఎస్పీ ఈ సందర్భంగా చెప్పారు.



### వాటర్ బేస్‌కు ఐఎస్‌ఓ సర్టిఫికేట్

రొయ్యల పెంపక కంపెనీల్లో ఒకటైన వాటర్ బేస్ తయారు చేసిన రొయ్యల మేత అంతర్జాతీయ ప్రమాణాలు కలిగి వున్నందున ఐఎస్‌ఓ సర్టిఫికేట్ లభించింది. ఈ సర్టిఫికేట్‌ను హోటల్ డిఆర్ ఉత్తమ డేస్ ఇన్‌లో 6తేది జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ డైరక్టర్ కాళ్లే, వాటర్ బేస్ ఛైర్మన్ విక్రమ్‌థాపర్‌కు అందించారు. ఈ సందర్భంగా కాళ్లే మాట్లాడుతూ నిరంతరం పరిశోధనలో, రైతులకు అనుభవపూర్వకమైన సలహాలను అందిస్తూ ఎప్పటికప్పుడు నాణ్యతను పెంచుకొన్నందు వల్లనే వాటర్ బేస్‌కు ఐఎస్‌ఓ సర్టిఫికేట్ లభించిందన్నారు. థాపర్ గ్రూపు సంస్థల ఛైర్మన్ విక్రమ్‌థాపర్ మాట్లాడుతూ రైతులను లక్షాధికారులను చేయడమే వాటర్‌బేస్ లక్ష్యమన్నారు. ఆక్వా రైతు సంఘ నాయకులు సామంతు గోపాలరెడ్డి, రాధాకృష్ణారెడ్డి, రవిచంద్ర రొయ్యల సాగులో సాధక బాధకాలను సభలో వెల్లడించారు. వాటర్ బేస్ సంస్థ వైస్ ప్రెసిడెంట్ పి.కె.రామచంద్రన్, జనరల్ మేనేజర్ రవి కూడా ఈ సభలో మాట్లాడారు.

### గ్రామపరిపాలనాధికారుల సంఘం

నెల్లూరు జిల్లా గ్రామ పరిపాలనాధికారుల సంఘ సమావేశం 6తేది అనితా హాల్‌లో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా జొన్నా వెంకయ్య, ఉపాధ్యక్షులుగా ఎం.రామ్మూర్తి, వి.భాస్కరరావు, పి.గోపాలరెడ్డి, కె.రామిరెడ్డి, పి.నారాయణమూర్తి, ప్రధాన కార్యదర్శిగా సిహెచ్. దశరథ రామిరెడ్డి, సహకార్యదర్శిగా వల్లూరు ప్రభాకరరావు, ఆర్గనైజింగ్ కార్యదర్శి ఎం.సత్యమూర్తి, కోశాధికారిగా పి.రాజా రామిరెడ్డిలను ఎన్నుకొన్నారు. అదే విధంగా రాష్ట్ర సంఘానికి జిల్లా ప్రతినిధులుగా నెల్లూరు డివిజన్‌కు దేవళ్ల దశరథ రామిరెడ్డిని, కావలి డివిజన్ నుంచి డి.మస్తాన్‌రెడ్డిని, గూడూరు డివిజన్ నుంచి వి.ఎ. పద్మనాభరెడ్డిలను ఎన్నుకొన్నారు.

### బి.వి.రావు వర్ధంతి

భారత కోళ్ల పరిశ్రమ పితామహుడు పద్మశ్రీ డాక్టర్ బి.వి.రావు 65వ జన్మదినోత్సవం, నేషనల్ ఎగ్ కో ఆర్డినేషన్ కమిటీ 18వ వార్షికోత్సవం 6తేది నెక్ ఆఫీసులో జరిగింది. కోళ్ల పరిశ్రమకు సంబంధించిన అన్ని వర్గాల వారు ఈ సందర్భంగా బి.వి.రావు చిత్రపటానికి మాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. ఈ సందర్భంగా ఉడకబెట్టిన గుడ్లను వెంకటేశ్వరపురం, ప్రభుత్వ టిబి హాస్పిటల్, పెద్దాసుపత్రి, లెప్రసీ హాస్పిటల్, విశ్వోదయ అంధుల పాఠశాల, మదర్‌థెరిస్సా వృద్ధుల ఆశ్రమంలోని వారికి పంచిపెట్టారు. ఈ కార్యక్రమాలను నెక్ జోనల్ ఛైర్మన్ ఎన్.బలరామయ్య నాయుడు నాయకత్వం వహించారు.



నెల్లూరు వచ్చిన వి.ఆర్. కాలేజి పూర్వ విద్యార్థి, కేంద్రమంత్రి వెంకయ్య నాయుడ్ని సత్కరిస్తున్న రత్నం విద్యాసంస్థల అధిపతి కె.వి. రత్నం.

### నిప్పు

2వ పేజీ తరువాయి

కౌన్సిలర్లు హాజరైన ప్రారంభోత్సవాన్ని అనధికారికమని, మంత్రి గౌరపరచడం అన్యాయమని చెప్పారు. ఈ విషయంతో ఎటువంటి సంబంధంలేని వైస్‌ఛైర్మన్‌కు షోకాజ్ నోటీసు ఇవ్వడం అక్రమమని విమర్శించారు. పెండి సురేష్ ప్రతిపాదించిన తీర్మానాన్ని కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదించింది. సీనియర్ కౌన్సిలర్ ఉటూకురు లక్ష్మయ్య సమావేశానికి అధ్యక్షత వహించారు.

జరిగిందేదో జరిగిపోయింది. అనవసరమైన షాదీమంజిల్ ప్రారంభోత్సవ వివాదాన్ని గోరంతలు కొండంతలు చేసి, మూడు నెలలుగా నెల్లూరులో ప్రజల బాధల్ని, సమస్యల్ని గాలికొదిలేశారు. ఒకరికొకరికి జుట్లు ముడివేసి తగాదాలు పెట్టడం, ఛండాలపు భాషలో తిట్టుకోవడం, కాంట్రాక్టర్ల బిల్లుల కోసం, వారిచ్చే కమీషన్ల కోసం కక్కుర్తిపడటం మానేసి, అన్ని పార్టీల వారు ఐక్యంగా ప్రజలకోసం పనిచేస్తే సంతోషం. లేదంటే ఈసారి ఎన్నికల్లో ఓట్ల కోసం పోతే, ముఖం మీద పేడనీళ్లు చల్లడం ఖాయం.

### "గుయ్యిమంది"

4వ పేజీ తరువాయి

జీతాలు ఎక్సైజ్ శాఖనే తెచ్చి ఇస్తున్నందున బ్రాందీ షాపుల వ్యవహారాల్లో చూసీచూడనట్లు వ్యవహరించమని సలహా యిచ్చారట. డిఐజి మంగళవారం ఎస్పీకి ఈ విషయమై ఫోను చేసిందే తడవుగా బుధవారం నుంచి అనధికార్ల బార్లను బ్రాందీ షాపుల వాళ్లు మళ్లీ తెరచివేశారు. నెల్లూరు టౌన్‌లో ప్రతి నెలా 4కోట్ల రూపాయల మద్యం అమ్ముడవుతుంది. కొత్త ఎస్పీ కరకుతనం మూలంగా గత నెలలో అది 2 కోట్ల రూపాయలయ్యింది. మొత్తానికి ఎస్పీ దూకుడుకు బ్రాందీ షాపుల యజమానులు తాము ఉన్నతాధికారులకు చెల్లించే లంచాల మూలంగా ముకుతాడు వేయించారు. ఈ వ్యవహారంలో ఎస్పీ మెత్తబడిపోతే ప్రయోజనం లేదు. ఆయన నిత్యనూతనోత్సాహాన్ని ఏదో ఒక రూపంలో కొనసాగించమని మా సలహా. బ్రాందీ షాపుల వాళ్లు చెప్పినట్లు ప్రభుత్వాలు నడవడం సిగ్గు చేటు కాదా? ఛీ ఛీ ఇంతకన్నా నైచ్యం మరొకటుందా?

### లంచాల సీళ్లు

4వ పేజీ తరువాయి

బస్టాండులో నేషనల్ మజ్దూర్ యూనియన్ ఏర్పాటు చేసిన సభలో మాట్లాడారు. రాష్ట్రంలో ప్రతి సంస్థను చంద్రబాబు నాయుడు ప్రవేటీకరించేసుకొంటూ వస్తున్నారని, దీనివల్ల ప్రతి సంస్థ ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోకి వెళ్లి పోతుందన్నారు. 19వేల పైబడి బస్సులు ఒక లక్షా 33వేల మంది సిబ్బందితో నడుస్తున్న ఆర్టీసి సంస్థ దేశంలో అత్యున్నత సంస్థగా గుర్తింపు బడిందన్నారు. నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మాట్లాడుతూ ఆర్టీసి సంస్థ నష్టాల ఊబిలోకి వెళ్లడానికి చంద్రబాబు నాయుడు విధానాలే కారణమన్నారు. ఆర్టీసి కార్మికుల సమస్యలను ఈసారి అసెంబ్లీలో ప్రస్తావిస్తానని వివేకానంద రెడ్డి కార్మికులకు హామీ ఇచ్చారు. మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానీబాషా, పిసిసి సభ్యుడు చేవూరు దేవకుమార్‌రెడ్డి, జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, పందిళ్లపల్లి అరుణమ్మ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

Registered : RN 1156 / 57 No. A.P. / VJA / 52 / 8 / 2000





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. **Ph: 091-861-327354,** Offset Printing at Zaminryot Press, Nellore.